# మిసిమి

*"All that we are is the product of what we have thought,"*
*is "We are what we think."* – **Dammapada.**


సంపుటి 5 మార్చి 1994 సంచిక 8

సంపాదకుడు: రవీంద్రనాథ్ ఆలపాటి


## విషయసూచిక




విడిప్రతి రూ. 5/- వార్షిక చందా రూ. 60/-

ముఖచిత్రం

చిత్రకారుడు: దామెర్ల రామారావు

Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH at Kala Jyothi Process Pvt Ltd, 1-1-60/5, Iftekar Mansion Lane, R T C X Roads, Musheerabad, Hyd-20
Ph 612436, 612337

**Editorial NEST**

Plot No 337-A, Road No 10, Jubilee Hills, Hyderabad-500 034. Ph 247717

# LIVING DICTIONARY
## (DEVIL'S DICTIONARY)

*Compiled by*
AMBROSE BIERCE (1911)

**Nominate,** *v.* To designate for the heaviest political assessment. To put forward a suitable person to incur the mudgobbing and deadcatting of the opposition.

**Nominee,** *n.* A modest gentleman shrinking from the distinction of private life and diligently seeking the honorable obscurity of public office.

**Nonsense,** *n.* The objections that are urged against this excellent dictionary.

**Notoriety,** *n.* The fame of one's competitor for public honors The kind of renown most accessible and acceptable to mediocrity. A Jacob's-ladder leading to the vaudeville stage, with angels ascending and descending

**November,** *n.* The eleventh twelfth of a weariness.

**Oath,** *n.* In law, s solemn appeal to the Deity, made binding upon the conscience by a penalty for perjury.

**Observatory,** *n.* A place where astronomers conjecture away the guesses of their predecessors.

**Obstinate,** *adj* Inaccessible to the truth as it is manifest in the splendor and stress of our advocacy.

**Ocean,** *n.* A body of water occupying about two-thirds of a world made for man who has no gills.

**Omen,** *n.* A sign that something will happen if nothing happens

**Opiate,** *n.* An unlocked door in the prison of Identity. It leads into the jail yard.

**Opportunity,** *n.* A favourable occasion for grasping a disappointment

**Opposition,** *n.* In politics the party that prevents the Government from running amuck by hamstringing it

**Oratory,** *n.* A conspiracy between speech and action to cheat the understanding. A tyranny tempered by stenography

**Orthodox,** *n.* An ox wearing the popular religious yoke

**Overwork,** *n* A dangerous disorder affecting high public functionaries who want to go fishing.

**Owe,** *v.* To have (and to hold) a debt. The word formerly signified not indebtedness, but possession; meant "own," and in the minds of debtors there is still a good deal of confusion between aseets and liabilities.

**Oyster,** *n.* A slimy, gobby shellfish which civilization gives men the hardihood to eat without removing its entrails! The shells are sometimes given to the poor.

**Pain,** *n.* An uncomfortable frame of mind that may have a physical basis in something that is being done to the body, or may be purely mental, caused by the good fortune of another.

**Painting,** *n.* The art of protecting flat surfaces from the weather and exposing them to the critic.

**Pantheism,** *n.* The doctrine that everything is God, in contradistinction to the doctrine that God is everything

**Pantomime,** *n.* A play in which the story is told without violence to the language. The least disagreeable form of dramatic action

# భారతీయ తత్వశాస్త్రం కల్పనామయమా?

– ఆచార్య దయాకృష్ణ

భారతీయ తత్వశాస్త్రం, భారతీయ సంస్కృతిలాగానే ఇష్టమైనవారిపట్ల ఆరాధనాభావాన్ని, కాని వారిపట్ల తీవ్ర విద్వేషాన్ని ప్రదర్శించింది. స్థిరచిత్తంతో, ప్రశాంతంగా ఆలోచించి విమర్శనాత్మక విశ్లేషణ చేసినవారు లేరు విశ్వస్థాయిలో అంగీకరించబడిన భావాలతో భారతీయ తత్వశాస్త్రాన్ని పరిశీలించడానికి చేసే ప్రయత్నమే ఈ వ్యాసం ఇతరమైన భావాలేవీ నిలబడలేవు భారతీయ తత్వశాస్త్రంలో ఈమూడు భావాలు రూఢిగా వున్నాయని భావించడం జరిగింది ఇంతవరకు సమీక్షించిన తత్వశాస్త్రవేత్తలందరూ సాంప్రదాయాన్ని అంగీకరించినవారే మూడు కల్పనలను యథార్థాలని చెప్పినవారే సంప్రదాయాన్ని ప్రశ్నించే సమయం ఆసన్నమయిందని నాకనిపించి విచారణ చేయడానికి ప్రయత్నిస్తున్నాను కల్పనలు యథార్థాల ముసుగు ఎప్పుడూ వేసుకుంటాయి

ప్రథమంగా విపరీత ప్రచారంలో వున్న విషయం భారతీయ తత్వశాస్త్రం 'ఆధ్యాత్మికం' (Spiritual) అని- ఇది అందరికీ తెలిసిందే అందరూ చెప్పిందే పాశ్చాత్య తత్వశాస్త్రానికంటే భారతీయ తత్వానికి వున్న ప్రత్యేక విశిష్టత ఈ ఆధ్యాత్మికత అందరూ అంగీకరించారేగాని చర్చించలేదు ప్రశ్నించలేదు నిజానికి ఈ ఆధ్యాత్మికత కేవలం కల్పన తాత్విక సంప్రదాయం మొత్తాన్ని ఆధ్యాత్మికం అనడంలో స్పష్టమైన అర్థం ఏమిటి? తత్వార్థంలో సత్ స్వభావం. ఇది మనస్సు, ఆత్మ వంటిదే ఆత్మ పదార్థానికి వ్యతిరేకం ఆత్మ ఒక్కటే వాస్తవం కనిపించేది మాత్రమే పదార్థం పదార్థం కొంత భ్రాంతి, కొంత అసత్తు ఒక్కటే, మాత్రమే అనే మాటలు అత్యంత ప్రాధాన్యత కలిగినవి ఈ పదాలు లేకుండా తాత్విక దృష్ట్యా అది ఆధ్యాత్మికం కాదు

భారతీయ తత్వశాస్త్రం ఆధ్యాత్మిక లక్షణాలతో వుందనడం కష్టమే. తాత్విక ధోరణులన్నీ పరసత్తా (Ultimate reality)ని అంగీకరించాయి.

జైనులు వైశేషికులు సాంఖ్యులు కూడా అతీతాన్ని స్పష్టంగానే గుర్తించారు చార్వాకుల్ని చేర్చడానికి వీల్లేదు అస్పృశ్యులుగావున్న చార్వాకులకోసం దేవీప్రసాద్ చటోపాధ్యాయ, వాల్టర్ రూబెన్ వంటివారు విశేషంగా కృషిచేశారు వైశేషికుల తత్వాన్ని నైయాయికులు అంగీకరించారు ఒకడుగు చార్వాకులవైపు వేశారు కాని ఆత్మను అంగీకరించారు. అయితే అది పదార్థానికి భిన్నమైనదనే విషయాన్ని తిరస్కరించారు. ప్రాచీన భౌతికవాదానికి దగ్గరగా వచ్చారు నైయాయికులు భగవంతుని అస్తిత్వాన్ని అంగీకరించడమనేది వేరేవిషయం

ఇంకా బౌద్ధులు, మీమాంసకులు, వేదాంతులు, యోగానుయాయులు ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేసినవారు కారు. న్యాయ వైశేషికులు చెప్పిన వాటన్నిటిని మీమాంసకులూ చెప్పారు. పంచభూతాలను కూడా పరమ సత్యానికి సంబంధించిన వస్తువులుగా పేర్కొన్నప్పుడు ఆత్మ ఒక్కటే సత్యం అని విశ్వసించారనడానికి ఆస్కారంలేదు బౌద్ధులు ఆత్మను, పదార్థాన్ని తిరస్కరించారు. బౌద్ధంలో రెండు సంప్రదాయ వాద ధోరణులున్నాయి. మాధ్యమికవాదం, యోగాచారం. మాధ్యమికులు భౌతిక సత్యాన్ని

అంగీకరించారు యోగాచారం భావవాదంలో కలిసింది మాధ్యమికం శూన్యవాదంలో లీనమయింది వేదాంతం అంటే శంకర వేదాంతం ఒకటేకాదు సౌలభ్యంకోసం అలా చెపుతున్నారు ఉపనిషత్తుల్లో చెప్పిందే మేము చెప్పేది అని అందరు వేదాంతులు చెప్పుకున్నారు ప్రకృతి శాశ్వతం అని స్వంత భావాన్ని ప్రవచించిన మధ్వుడు వేదాంతినని చెప్పుకున్నాడు భగవంతునికి భక్తునికివున్న భేదాన్ని గుర్తించాడు రామానుజుడు. పదార్థం వేదాంతులకు అసత్యంకాదు శంకర అద్వైతాన్ని ఖండించి జగత్తుకు, బ్రహ్మకు సమానస్థానమిచ్చాడు రామానుజుడు. యోగం తత్త్వశాస్త్రం కాదు సాధనకు సంబంధించింది. సాంఖ్య యోగాలు ప్రకృతిని సత్పదార్థంగా భావించాయి.

భారతీయ తత్వశాస్త్రం - ఆధ్యాత్మికం అనడం సత్యదూరం. మానవుని అన్వేషణ, సాధన ఆత్మ సాక్షాత్కారం కోసమేనని అనుకున్నారు. తరవాతకాలంలో ధర్మార్థకామాలుగా వున్న మూడు పురుషార్థాలకు మోక్షంకూడా చేరి నాలుగు పురుషార్థాలైనాయి. శ్రమణ, బౌద్ధ, జైన సంప్రదాయాలనుంచే మోక్షం ప్రవేశించింది. ఆదిలో మత సంప్రదాయాలు తాత్విక తార్కిక ఆలోచనకుగాక ఆధ్యాత్మిక అన్వేషణకు ప్రాధాన్యత యిచ్చాయి. కాలక్రమంలో తాత్విక ఆలోచనా పటిమ పెరిగింది ఈ విధంగా మోక్షం అవైదిక మతాలనుండి ఆధ్యాత్మిక సంప్రదాయంనుండి ప్రవేశించింది. మోక్ష సాధనలో ధర్మార్థ కామాలను వదులుకోవాల్సిందే సమాజంలో నైతికతకూ ఆధ్యాత్మికతకూ దూరం పెరిగింది ఎంతో ఆధ్యాత్మికవేత్త అయితే అంత అవినీతిపరుడన్న భావం విదేశీయులకు ఏర్పడేందుకు అవకాశం కల్పించింది.

## 2

భారతీయతత్వం ఆధ్యాత్మికం అనడమేకాదు. ప్రామాణికత, వేదాధికారం అంగీకరించిన వాటిని వైదిక ధోరణులని, అంగీకరించనివాటిని నాస్తికవాద ధోరణులని విభజించారు. ఒకడి తత్వ సిద్ధాంతానికి వేదాలను ప్రమాణంగా అంగీకరించడం అంటే అర్థం ఏమిటి? తను చెప్పేది వేదం ఒప్పుకుంటే వాడు చెప్పవలసిందేమీ లేదు. వేదాల శాశ్వతత్వం కోసం అవి అపౌరుషేయాలని, పరిపూర్ణ సత్యాలని నమ్మించడంకోసం అవిధంగా చేశారు. మీమాంసకులకు వేదం ప్రమాణం. వేదాంతానికి వేదాల్లో భాగమైన ఉపనిషత్తులు ప్రమాణం వేదం అనలేదు, బహువచనంలో వేదాలు అనడం గుర్తించదగింది. వేదాలకు మొదట ప్రాధాన్యత ఉండి వుండదు. ఒక వెయ్యి సంవత్సరాల అనంతరం చేర్పులుచేసి కొంతవరకు ప్రమాణంగా తీసుకుని వుండవచ్చు. వేదాలు ఏ తత్వాన్ని ప్రతిపాదించలేదన్నారు మీమాంసకులు. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీతలనే ప్రస్థాన త్రయాన్ని ప్రమాణంగా భావించారు. శంకరుని కాలంనుంచే బ్రహ్మసూత్రాలకు, భగవద్గీతకు ప్రాధాన్యం. ఉపనిషత్తులు భాగం కాని వేదాలను వేదాంతులు అంగీకరించలేదు బ్రహ్మసూత్రాలు వేదాల్లోని భాగంకాదు మరి. వీటన్నిటిని బట్టి చూస్తే వేదప్రమాణం కూడా ఒక మిధ్య వైదిక, అవైదిక భేదాలను గుర్తించడానికి ఖచ్చితమైన సరిహద్దురేఖలు లేవు శంకరుడన్నాడుగదా భౌతిక విషయాలకు వేదాలను ప్రమాణంగా తీసుకోరాదని. ఆధ్యాత్మిక విషయాలకు మాత్రమే దానికి అధికారం. వేదప్రమాణం కల్పన నవ్యన్యాయం గంగేశుని తరవాత వచ్చిన ఉద్దండ పండితులైన విశ్వనాథుడు, గదాధరుడు, రఘునాథ శిరోమణి ప్రభృతులవలన నూతన కవాటాలు తెరవబడి కొత్త వెలుగులు తొంగిచూచాయి గౌతముని న్యాయ సూత్రాలే పరమ ప్రమాణమని వారు భావించలేదు.

అద్వైతులు శంకరుని తరవాత ఆయన్ని అనుసరించలేదు శంకరునికి దూరమైనారు. కాని బ్రహ్మ సూత్రాలకు కాదు. పద్మపాదుడు, సురేశ్వరాచార్యుడు, ప్రకాశాత్ముడు, చిత్సుఖుడు, ప్రకాశానందుడు, వాచస్పతిమిశ్ర, మధుసూదన సరస్వతి - వీరంతా శంకరుని గుడ్డిగా అనుసరించినవారు కారు.

మండనమిశ్రుని అద్వైతసిద్ధి స్వతంత్ర రచన. బ్రహ్మసూత్ర భాష్యం కాదు. బ్రహ్మసూత్రాలకు శంకరుని తరవాత అద్వైతపరంగా రాసిన భాష్యకర్తలు లేరు. ఆధునికుడైన సర్వేపల్లి రాధాకృష్ణన్ ఆచార్యుల సరసన చేరిపోవాలనే కాంక్షతో బ్రహ్మ సూత్రాలకు భాష్యం రాశాడేగాని వారి తాత్విక భావాలకు ప్రమాణమనికాదు మాధ్వ నింబార్కుల భాష్యాలు అద్వైతంకావు. ప్రభాకర, కుమారిలుల తరవాత జైమిని సూత్రాలకు ప్రాధాన్యత పోయింది వైశేషిక సూత్ర భాష్యం ప్రశస్తపాదుని తరవాత ఎవ్వరూ వ్రాయలేదు ఈశ్వరకృష్ణుని సాంఖ్యకారికలు వచ్చినా సాంఖ్యం అతిప్రాచీనం. బౌద్ధ జైనులకు పవిత్ర, తత్వపార్య గ్రంథాలేమీ లేవు. ప్రమాణ గ్రంథాలు అంటే వేదాలు, సూత్ర గ్రంథాలవంటివి లేవు భగవద్దత్తమని, అపౌరుషేయమని అవాకులు చెవాకులు పలకలేదు. గొప్ప ఆలోచనా, తార్కిక కౌశలం కలిగిన మేధావులున్నారు మంచి పుస్తకాలున్నాయి వారికి అంతవరకే. హిందూ తాత్విక సంప్రదాయం కూడా బౌద్ధం వంటిదేనని నా అభిప్రాయం

## 3

ఆధ్యాత్మికత, ప్రామాణికతలు మాత్రమేకాదు మూడవది సంప్రదాయవాద ధోరణి (School of thought) కూడా మిథ్య అంటున్నారు నాస్తిక, ఆస్తిక ధోరణులుగా భారతీయ తత్వశాస్త్రాన్ని విభజించారు. ప్రాచీన దార్శనికులు ఈ ధోరణులను అంగీకరించారు. ప్రమాణం, ఆధ్యాత్మికత లనే ముసుగులు వేసినట్టుగానే దార్శనిక సిద్ధాంతాల పేరుతో ముసుగు వేశారు. చరిత్ర అంటే మార్పు, అభివృద్ధి, భిన్నధోరణుల మధ్య వైరం, అన్వేషణ అనుకున్నప్పుడు, ఆదిలోనే ఒక గ్రంథాన్ని ప్రమాణంగా తీసుకుంటే ఇక అభివృద్ధి ఎక్కడ? చరిత్ర ఎలా అవుతుంది? ఒక సిద్ధాంత చట్రంలో బిగించబడి ఎన్నడూ వుండదు, వుండలేదు, ఆలోచనాశీలి అయిన మానవుడు. ఒక ధోరణికి, శైలికి వున్న భేదం verbal మాత్రమేకాదు రేషనలిజం, ఎంపిరిసిజం, రియలిజం, ఐడియలిజం వీటికి సమానమైన తాత్విక ధోరణులు భారతీయ తత్వశాస్త్రంలో చూపగలరా? వ్యక్తి ఆలోచనకూ సిద్ధాంతానికి భేదం వుండకపోవచ్చు. ఉదాహరణకు సాంఖ్యంతో ఈశ్వర కృష్ణుడు, వేదాంతంతో శంకరుడు తాదాత్మ్యం పొందారు అయితే శంకరుడు చెప్పిందంతా అద్వైతమూ కాదు. ఈశ్వర కృష్ణుడు చెప్పిందంతా సాంఖ్యమూ కాదు వ్యక్తి ఆలోచనకు, ఆలోచనా శైలికి మధ్య గందరగోళం ఏర్పడుతుంది. తత్వశాస్త్రానికి వ్యక్తి కాంట్రిబ్యూషన్ ఏమిటో తెలియాలి. దాన్ని ధోరణిలో కలిపితే వ్యక్తి మునిగిపోతాడు. ఇది గుర్తించకపోతే భారతీయ తత్వశాస్త్రానికి అన్యాయం చేసినట్లే. తాత్విక ధోరణుల చరిత్రకాదు; వైయక్తిక తాత్వికుల ఆలోచనల క్రమ వికాసచరిత్ర కావాలి. అప్పుడు మన చరిత్ర, పాశ్చాత్య తత్వశాస్త్ర చరిత్రతో సరితూగుతుంది.

## 4

భారతీయ తత్వశాస్త్రం గురించి మూడు కల్పనలను తెలుసుకున్నాము. ప్రామాణికత (Authority), ఆధ్యాత్మికత (Spitituality), Schools of thought మిథ్యలేనని గుర్తించకుండా తత్వశాస్త్ర రచన అసాధ్యం. ఒక నూతన దృక్కోణంనుండి పరిశీలించాలిన అవసరం ఎంతైనా వుంది ప్రాచీన తాత్వికుల భావసంపదను ఆధునికులకు మార్గదర్శకంగా రూపొందించాలంటే ఈమూడు కల్పనలనూ ధ్వంసం చేయాలి అప్పుడే ప్రాచీన తత్వశాస్త్ర చరిత్రను సజీవంగా రచించడం జరుగుతంది ★

---

(ప్రొ దయాకృష్ణ రాజస్థాన్ యూనివర్శిటీలో ఆచార్యులుగా పనిచేశారు జర్నల్ ఆఫ్ ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ ఫిలాసాఫికల్ రిసర్చికి సంపాదకులుగా వున్నారు తత్వశాస్త్రంమీద అనేక వ్యాసాలు వ్రాశారు. ఈ వ్యాసానికి మూలం **'Three Myths about Indian Philosphy.)**

# మేధస్సు - మతిభ్రమణ కవలలా!

అధికారంలో వున్నవాళ్ల మనస్తత్వాన్ని ఎప్పటికప్పుడు జాగ్రత్తగా పరీక్షించాలి. పిచ్చివాడు గద్దె ఎక్కితే ఆటం బాంబులను బంతులవలె ఆడుకోగలడని ఎరిక్‌ఫ్రాం హెచ్చరించాడు ఆధునిక మనోవిజ్ఞాన పరిశోధనలలో యీ విషయానికి చాలా ప్రాధాన్యత లభిస్తోంది. అమెరికా, యూరోప్‌లలో జరుగుతున్న పరిశోధనలబట్టి మేధస్సుకూ - ఉన్మత్తతకూ తేడా చాలా స్వల్పం అని తేలింది. గత చరిత్ర చూస్తే ఎందరో కవులు, కళాకారులు, రచయితలు అటు తెలివితేటల్ని, యిటు ఉన్మత్త లక్షణాలను ప్రదర్శించారు. ఇందులో మన అభిమానులు, వీరులు ఎందరో వున్నారు. బైరన్, షెల్లీ, వర్జీనియా వుల్ఫ్, కాల్ రిట్జ్ ఎందరినో ఆకట్టుకొన్న ప్రపంచ ప్రసిద్ధులు. వారికి మనో వైకల్యాలు వున్నాయని తేలింది.

కవులు, కళాకారులు పిచ్చి లక్షణాలను ప్రదర్శించినా, వారి ప్రతిభ - కవిత, చిత్రం, సంగీతం - వలన లోటును జనం క్షమించక తప్పదు. ఈ పిచ్చి లక్షణం ప్రాచీన కాలంనుండే గొప్పవారిలో వున్నట్లు ఆధారాలు వున్నాయి. కళారంగానికీ ఉన్మత్తతకూ సన్నిహిత సంబంధం వుండటం, అప్పుడప్పుడూ ప్రతిభను ప్రదర్శించడం, మధ్యమధ్య పిచ్చిగా ప్రవర్తించడం, మనలోకంలో లేకపోవడం, యీలాంటి లక్షణాలు సర్వసాధారణంగా వెల్లడౌతు న్నాయి. కొన్నాళ్లు ఆరోగ్యంగా వుంటూ, హఠాత్తుగా కుంచించుకుపోయి, వింతగా ప్రవ ర్తిస్తూ మనోవైకల్యాలను చూపడం ప్రతిభావంతుల లక్షణంగా గ్రహించడం కష్టమే. కాని అది వాస్తవం కూడా.

కళకారులలో సర్వసాధారణంగా కనిపిస్తున్న యీ మనో వికారాలు కవులలో 13 శాతం, కళాకారులలో 17 శాతం వున్నాయని పరిశోధకులు అన్నారు మెదడు పరిశీలన వలనకూడా యీ విషయాలు తెలిశాయి.

డా కె. రెడ్ ఫీల్డ్ జామిసన్, డా. ఆర్నాల్డ్ లడ్ విగ్ అనే యిరువురు మనోశాస్త్రజ్ఞులు యిటీవల పరిశోధనల ఫలితాలను పుస్తకరూపంగా వెల్లడించగా యీలాంటి విషయాలు ఆశ్చర్యపరుస్తున్నాయి. ప్రతి వందమందిలో కనీసం ఒకరికైనా యీలాంటి ఉన్మత్త లక్షణాలు కనిపిస్తున్నాయట!

పిచ్చి లేక ఉన్మత్త లక్షణం వంశపారంపర్యం అనేది ఇంకా నిర్ధారణగా తేలని పరిశోధనాం శంగా వున్నది. పరిణామక్రమంలో జీవాణువుల్ని తరచి చూస్తున్నారు ఏమైనా మేధస్సుగల కళాకారులకు కొంత వికారం వుండడం క్షమార్హమేనేమో!

- ఆధారం 'టైమ్స్'

# ద్రావిడ నాగరికతా విస్తరణ

– ఆచార్య బి.యస్.యల్. హనుమంతరావు

(గత సంచిక తరువాయి)

**పార్వతి :** 'పార్వతి' అనగా పర్వతరాజు కుతురు ఆమె చంద్రశేఖరుడైన శివునిగురించి తపస్సుచేసి ఆ మహాదేవునే భర్తగా పొందింది ఇది పురాణాలలోని గాథ. మెసొపొటేమియాలోని ఊర్ నగరప్రజల ప్రధానదేవత ''పర్వతరాణి'' (Lady of the Mount) ఈమె భర్త చంద్రుడు. వీరికి ప్రతి సంవత్సరము కళ్యాణమహోత్సవము జరిపేవారు పర్వతరాణియే పార్వతియైనదని, చంద్రుడే చంద్రశేఖర అవతార మెత్తి భారతదేశమున ప్రత్యక్షమైనాడనుటలో సందేహంలేదు. మనదేశంలోగూడ పార్వతీ చంద్రశేఖరు లకు ప్రతి సంవత్సరము ''తిరుక్కలియాణము'' లేక 'తిరునాళ' జరుగుచునే యున్నది గదా! ఆదిమ సంప్రదాయాలను నిలబెట్టే గౌరవం భారతీయులదే!

ఊర్ ప్రజల పర్వతరాణివంటి దేవతనే క్రీటు ద్వీపవాసులు సైతం ఆరాధించినారు ఆమెపేరు 'మా'; ఆమె వ్యాఘ్రవాహిని. ఆమె భర్త నందివాహనుడు! వీరికినీ, హిందువుల ఉమాశంకరులకును భేదం లేదనే చెప్పవచ్చు

**చంద్రారాధన :** మెసపొటేమియా ప్రజలు చంద్రుని ఆరాధించినట్లు పేర్కొన్నాము; మధ్యాసియా లోని ఇతరజాతుల్లో సైతం ఈ ఆచారం కనిపిస్తుంది. ఇది అవైదికము, శిలప్పదికారం మొదలగు తమిళగ్రంథాల ద్వారా తమిళులలో చంద్రారాధన ఉన్నట్లు స్పష్టమవుతున్నది. ఈజిప్టియనులు, ఛాల్డియన్లు చాంద్రమానము ననుసరించినారు. ఆంధ్రదేశంలో నేడమలులో నున్నది చాంద్రమానమే! నేటికినీ మహమ్మదీయులు అనుసరించుచున్నది చాంద్రమానమే గదా! అల్లసాని పెద్దన చెప్పినట్లు ''గోవధము సేయు తురకలదైవము'' చంద్రుడు!

**తలనీలాల సమర్పణ :** ఆంధ్రదేశంలో తిరుపతి వేంకటేశ్వరాలయంలో తలనీలాలను ముడుపు చెల్లించే ఆచారం ప్రసిద్ధము. తిరుపతిలోనే గాక దక్షిణదేశమున పెక్కు క్షేత్రాలలో నీలాల సమర్పణ జరుగుతున్నది. ఇదే విధమైన ఆచారము ఫినీషియన్ వలసయైన బిబ్లస్‌లో కన్పిస్తున్నది. ఇచట దేవాలయాలలోని దేవత సగము చేప, సగము మనిషి. ఈ దేవాలయం సుమారు ఆరువేల సంవత్సరాలనా టిది. హిందువుల నరసింహునకు, విఘ్నేశ్వరునకు బిబ్లస్‌లోని నరమత్స్య దేవతకు పోలిక స్పష్టం. ఇటువంటి నరమృగ దేవతలను (Zoomorphic Gods) ఆటవిక దశలో ప్రజలారాధించినారు. వీరు ఆర్యేతర దేవతలే.

తలనీలాల నర్పించడం తలనర్పించడంతో సమానం పరమశైవుడైన రావణుడు తలలనర్పించి శివుని ఆరాధించినట్లు రామాయణంలో ఉంది తలల నర్పించడం తీవ్రవాద శైవాచారంగా మధ్యయుగం వఱకు ఆంధ్రదేశంలో ఉంది. కొండవీటి రెడ్డిరాజులు, శ్రీశైలాది శైవక్షేత్రాలలో, వీరశిరోమండపాలను నిర్మించి నారు. కాని తలలనర్పించు సాహసములేని భక్తులు తల నీలాలనర్పించి తృప్తి వహించేవారని భావించ వచ్చు. ''పుష్పార్థం అక్షతాన్ సమర్పయామి'' అని కదా సంప్రదాయం. రావణుడు సైతం తన తలలను బోలిన తలలను చేయించి హోమములో వ్రేల్చి వుంటాడు. తల నీలాల సమర్పణ మనగా ఆత్మార్పణం

చేయడమే! భక్తిభావమునకది పరాకాష్ఠ. మొట్టమొదట తిరుపతి శైవక్షేత్రమనీ, శ్రీరామానుజాచార్యుల కాలమున వైష్ణవులు ఆక్రమించి వైష్ణవక్షేత్రమగ మార్చిరనీ స్థలపురాణం ద్వారా తెలియుచున్న విశేషము. నేటికిని దేవుని నిజస్వరూపము పూజారులకు వినా ఇతర భక్తులకు కన్పింపదట! ఏమైనను 'నరమత్స్య' దేవతలోవలెనే 'వేంకటేశ్వర' నామంలో సగము వైష్ణవము, సగము శైవము! 'మధ్యవైష్ణవులకు నామములు పెద్ద' అనగా శ్రీ వేంకటేశ్వరుని ముఖమంతా నామాలే! వైష్ణవక్షేత్రంగా మారిన తరువాత సైతము ప్రాచీన శైవాచారమైన శిరోజార్పణ నిలబడి వుండడమే తిరుపతిలో గమనింపదగిన విశేషము!

**దేవదాసి :** దక్షిణదేశ దేవాలయములలో దేవదాసి సంప్రదాయము చాల ప్రసిద్ధము. ఇదే సంప్రదాయం సిరియా, ఆర్మీనియా, లిబియా దేశాలలోని దేవాలయాల్లో సైతం అనుసరించబడింది. సుమేరియాలో ఒక్కొక్క దేవాలయమున దేవదాసీల సంఖ్య వందలకొలది ఉండేది ఆంధ్రదేశంలో దేవాలయ శాసనాలలో 'మున్నూర్వురుసానులు' అనేమాట తరచుగా కన్పిస్తుంది. బహుశాసానులు కూడ శ్రేణులుగా ఏర్పడేవారేమో!

**పూజా విధానము :** మన దేవాలయాలలో రాజోపచార సమన్వితమైన పూజావిధానాన్ని అనుసరిస్తారు. దేవునకు అర్ఘ్యపాద్యాలిస్తారు, శంఖాలు పూరిస్తారు; గంటలు-వేణువులు-వీణలు వాయిస్తారు నృత్య గీతాల సంగతి వేరే చెప్పనక్కరలేదు ధూపదీపాలు సమర్పిస్తారు. వింజామరలు వీస్తారు. తుదకు నైవేద్యము పెట్టి ఆ భోజ్యములను ప్రసాదంగా స్వీకరిస్తారు. ఇంచుమించు ఇదే విధానము క్రీటు, సుమేరియా దేవాలయాలలోనూ అనుసరించేవారు. ఇది వైదికమైన హోమ విధానమునకు విరుద్ధమైన పూజావిధానము 'పూజ' అనుపదము ఆర్యేతరమని కొందరి అభిప్రాయము సంస్కృతమున వినా మరి యే యితర ఇండో యూరపియను భాషలలోను 'పూజా' అనేమాట లేదట.

**పూజారులు :** సింధు శిధిలాలలో ఒక పురుష ప్రతిమ బయల్పడింది. అది ఆ ప్రజల పూజారి ప్రతిమయని చరిత్రకారుల అభిప్రాయము ముఖ్యంగా ఈ పూజారి వేషము గమనింపదగింది. అతడు ఉత్తరీయాన్ని ధరించాడు: ధోవతి - ఉత్తరీయములు ద్రావిడ లేక ఆర్యేతర వస్త్ర పద్ధతియేయని అంగీకరిస్తున్నారు. ఉత్తరీయాన్ని ఈ పూజారి ఉపవీతం పద్ధతిలో ధరించినాడు; అనగా కుడి భుజము క్రిందుగా - ఎడమ బుజముమీదుగా దాల్చి, ఎడమ భుజముదిగువ వక్షస్థల సమీపమున ముడివేసినాడు. ఇది యజ్ఞోపవీతమునకు అంకురార్పణ అనవచ్చును. యజ్ఞోపవీతమనగా యజ్ఞకాలమున ధరించు ఉత్తరీయము. కావున యజ్ఞోపవీతమనగా వల్లెయే! శిల్పాగమాలలో వస్త్రయజ్ఞోపవీత ప్రసక్తి వుంది. గుప్తయుగమునాటి శిల్పాలలో సుదీర్ఘమైన వస్త్రయజ్ఞోపవీతాలు కన్పిస్తాయి. ఉపనయనార్హతలేని శూద్రులు సైతం పితృకార్యముల సందర్భంలో వస్త్రయజ్ఞోపవీతాలు ధరిస్తారుగదా! సింధు పూజారి ప్రతిమను బోలినట్టివే మెసపొటేమియాలో కూడ దొరికాయి. దీనివలన ఉభయ దేశాలలోనూ పూజారులొకేరకములైన దుస్తులు ధరించేవారనియేగాక యజ్ఞోపవీతము ఆర్యేతర సంప్రదాయముగ నుదయించినదనియూ, మొదట, ఉత్తరీయముగానే యుండి నేటికి లాంచనప్రాయమైన నూలుపోగుగ మారిపోయినదనియు గ్రహించవచ్చును సింధు పూజారి నుదుటిపై బాసికమును పోలినదానిని ధరించియుండుట సైతము గమనింపదగియున్నది. మత సంబంధమైన కార్యక్రమములలో నేటికినీ బాసికములు, కంకణములు ధరించునాచారము మనలో నున్నది గదా! ఇది చరిత్ర పూర్వయుగంనాటి సంప్రదాయం!

మరొక విశేషమేమన, సింధు మెసపొటేమియా పూజారులు తలకట్టు, మీసము తీసివేసి గడ్డమును మాత్రము పెంచినారు. ప్రస్తుత మీ సంప్రదాయము ముస్లిములదని హిందువుల విశ్వాసము! అన్ని

మతములలోను, గడ్డం మతమునకు చిహ్నమను విశ్వాసం కన్పిస్తున్నది సనాతన హిందువులలో సైతమీనమ్మకము ఉంది. వారిలో మీసమును పెంచుట దోషమను నమ్మకం సైతం ఉంది. మత సంబంధమైన కార్యకలాపముల సందర్భమున ''కేశశ్మశ్రుపావయిత్వా'' - తలజుట్టు, మీసము తీయించుమని ధర్మశాస్త్రం ఆదేశిస్తున్నది. ఒక సందర్భములో తిరుపతి వేంకటకవులు, ''దోసమటంచెఱెంగియును దుందుడుకొప్పగ పెంచినార మీ మీసలు'' అంటూ చాటినారు. కావున సనాతన హిందూ ధర్మము ననుసరించి మీసము పెంచటం దోషము దీనిని బట్టి జుట్టు, మీసము తీయించి గడ్డము పెంచుట ఇస్లాము మత సంబంధమైన ప్రత్యేక సంప్రదాయముకాదనీ, మిక్కిలి ప్రాచీనము, సనాతనమునైన భారతీయ ఆచారమేననీ తెలుస్తున్నది.

## వాస్తు నిర్మాణాదులు

**పురములు, ఆలయములు :** వైదికార్యుల విరోధులైన ఫణి మున్నగు జాతులు వాస్తువిద్యలో నారితేరినట్టు పేర్కొన్నాము. వారి నిర్మాణ కౌశల్యానికి హరప్పా మొదలైన చోట్ల బయల్పడిన కట్టడాలే నిదర్శనములు ఋగ్వేద సంహితాకాలంలో ఆర్యులకు స్థిరనివాసాలు లేవు అనార్యుల పట్టణాలను, దుర్గాలనుచూచి సంభ్రమాశ్చర్యములను వెల్లడించినారు దుర్గానికి ఆనాడు 'పురము' అని వ్యవహారముంది పురములను నిర్మూలించినవాడే పురందరుడు! బ్రాహ్మణములలో 'ఆర్మ', 'ఆర్మక' అనే ప్రయోగాలు తరుచు కన్పిస్తున్నాయి. వీనికి 'వినష్టగ్రామ'మని అర్థము ఉత్తరాపథము నందలి తమగ్రామములు ఆర్యదండయాత్రలలో నష్టపడిన తరువాతనే ఆర్యేతరులు దక్షిణాపథమును చేరి అచట పట్టణములు, పురములు, దేవాలయములు నిర్మించుకొన్నారు ప్రాచీన తమిళవాఙ్మయము నుండి నాటి దాక్షిణాత్యుల నిర్మాణకౌశల్యము స్పష్టంగా తెలుస్తున్నది ఈ నిర్మాణములకు ఈజిప్టు, క్రీటు, బాబిలోనియా, సుమేరియా దేశాలలోని కట్టడాలకు పోలికలున్నాయి ఈజిప్టులోని పిరమిడులను గురించిగాని, కార్నక్ మున్నగు దేవాలయములను గురించిగాని చెప్పనక్కరలేదు క్రీటులో క్నొసాస్ చెంత పద్మవ్యూహమును బోలిన రాజప్రాసాదము బయల్పడింది సుమేరియాలో ఒక్కొక్క దేవళమొక రాజ ప్రాసాదము తమిళులు తరచుగావాడు కోవెల ( దేవాలయము) పదమునకు రాజప్రాసాదము అనే అర్థం ఉంది

**గోపురాలు :** సుమేరియన్లు 'నిప్పూర్'లో తమ ఇష్టదైవమైన 'ఎన్ లిల్'కు పెద్ద గోపురాన్ని నిర్మించారు ఎన్ లిల్ వాయుదేవుడు, బహుశా ఈ పదమే 'అనిల'గా సంస్కృతభాషలో ప్రవేశించి ఉంటుంది. బైబిల్ లోకూడ గోపురాల ప్రసక్తి (Tower of Babel) వుంది. దక్షిణాపథంలో అమలులో నున్న దేవాలయ వాస్తు పద్ధతిలో గోపురానికి ప్రముఖ స్థానముంది ఆలయ ప్రాకారములోని గోపురమును 'గాలి గోపురము' అంటారు! సుమేరియాలోని ఎన్ లిల్ గోపురానికి, గాలిగోపురానికి సంబంధమును ఊహించవచ్చును

## సాంఘిక సంప్రదాయములు

**ఆభరణాదులు :** దాక్షిణాత్య ప్రజలకును, మధ్యధరా సముద్రప్రాంత ప్రజలకు అనేక సాంఘిక సంప్రదాయాలు సమానమని తెలుస్తున్నది దక్షిణదేశ ప్రాచీన సమాధులలో రంగుకుండలు బయల్పడినవి, ఇటువంటివే మధ్యాసియాలో తేపెహిస్సార్, సుసాప్రాంతాలలోను, ఇటీవల బెంగాలు రాష్ట్రములోను బయల్పడినాయి దాక్షిణాత్య స్త్రీలకు 'అందె' అభిమాన ఆభరణము శిలప్పదికారం అనే తమిళ

కావ్యానికి అందెయే కథావస్తువు. ఈ అందెను బోలినదే క్రీటులో క్నాస్సాస్ భవనంలోని కుడ్యచిత్రాలలో కనిపించింది

ఆదిచ్చనల్లూరు సమాధులలో బంగారుపతకాలు, బంగారు బూరలు దొరికినాయి, పూజా సమయాలలో నీ బూరలను పూరించేవారు. నేటికిని పలని కొండలలోని మురుగన్ దేవాలయానికి కావడులు మోసుకొని పోవువారు ఇటువంటి బూరలనే ఊదుతూ నడుస్తారు ఈరకమైన బూరలు మనదేశమున మరియే ప్రాంతంలోను దొరకలేదు. కాని సైప్రస్ దీవిలో ఎన్‌కోమిలనేచోట కంచు యుగానికిచెందిన సమాధులలో దొరికినాయి, పాలస్తీనాలో గజా, గరార్ ల చెంత దొరికిన శిరోవేష్టనములకు, కిరీటములకు, ఇనుప పనిముట్లకు ఆదిచ్చనల్లూరులో దొరికిన వానికి పోలికలున్నాయి.

కావేరి తుంగభద్రానదులను దాటటానికి 'పుట్టి' (Coracle) అనే సాధనాన్ని ఉపయోగిస్తారు వెదురు లేక ఈత పేళ్ళతో తట్టవలె అల్లి దానిపై చర్మం కుట్టిన ఈ సాధనము చాలా ప్రాచీనమైనది తెలుగులో 'పుట్టి మునిగింది' అనే సామెత సర్వసాధారణము పుట్టివంటి సాధనమునే ప్రాచీనయుగంలో యూఫ్రటీస్, టైగ్రిస్ నదులపై ఉపయోగించారు నేటికిని వేల్సు, ఐర్లండు దేశాలలో వాడుతున్నారు

సమాధులు : సంస్కృతీ సంబంధములను నిర్ణయించడంలో అంత్యక్రియలకు సంబంధించిన సంప్రదాయముల ప్రాముఖ్యం ఎక్కువ మనదేశంలో దహనం ఆర్య సంప్రదాయమనీ, ఖననము అనార్యమనీ సాధారణ విశ్వాసం అనార్యులలో ఐదురకముల ఖనన సంప్రదాయము లుండినట్లు దక్షిణదేశమున బయల్పడిన ప్రాచీన సమాధులవలన తెలుస్తున్నది ఈ ఐదు రకాల సమాధులు మధ్యఆసియా, మధ్యధరా ప్రాంతాలలో కూడ బయల్పడినాయి. వీనిలో మూడు రకాల సమాధులను బండలు, రాతిపలకలు ఉపయోగించి నిర్మించేవారు వీనిని ఆంధ్రదేశంలో 'రాక్షసగుళ్ళు' అని వ్యవహరిస్తారు శవపేటికల నుపయోగించే సమాధులు మరొక రకము సబర్మతీనదీలోయలో దొరికిన ఒక శవ పేటికకాళ్ళు ఏనుగు కాళ్ళను పోలియున్నాయి, ఇట్టి శవపేటికయే సిరియాలో క్యాటాల్ చెంతదొరికింది. ఇటీవల నాగార్జునకొండ కావలివైపు ఏలేశ్వరము చెంత త్రవ్వకాలలో ఏనుగును పోలిన అవశేష పేటిక దొరికినది.

ఆదిచ్చనల్లూరులో దొరికిన శవపేటికలలో బంగారు శిరోవేష్టనాలు లభించినాయి ప్రాచీన కాలమున శవములకు బంగారు శిరోవేష్టనములను చుట్టే ఆచారం పాటించేవారు ''సట్టయం కట్టరాదు'' అనే ఈ ఆచారం నేటికినీ మధురై ప్రాంతాలలో సజీవంగా ఉంది ఆదిచ్చనల్లూరు శిరోవేష్టనాలను పోలినవే గ్రీసులో మైసీన్‌చెంత కనిపించినాయి పాలస్తీనాలోని ప్రాచీన సమాధులకు ఆదిచ్చనల్లూరు సమాధులకు పోలికలు చాలా ఉన్నాయి

ఐదవరకం సమాధులు గుహా సమాధులు ఇవి మలబారులో ఎక్కువ వీనిని ''తొలై'' అంటారు అంటే రంధ్రము అని అర్థము ఈ పదము 'తొలుచు' నుండి వచ్చి ఉంటుంది ఇట్టి సమాధులే క్రీటులోగూడ కనిపించడం ఆశ్చర్యమే అక్కడకూడ ఈ సమాధికి 'తొలై' అనే పేరే ఉండడం మరింత ఆశ్చర్యకరము

## ఏది జన్మ స్థలము?

ఈ పరిశీలన వలన భారతీయ ద్రావిడ జాతులకును, మధ్య ప్రాచ్యంలోని ప్రాచీన జాతులకును మధ్యకల సాంస్కృతిక సంబంధాలు యాదృచ్ఛికములు కావనీ, ఈ జాతులన్నియూ నొక ఆదిమ

మూలజాతి శాఖలే ననడానికి తగినంత బలీయమైనసనియు స్పష్టమౌతున్నది కాగా ఈ మూలజాతి ఆదిమ నివాసస్థలిమేది? ఈ జాతులన్నియు నొకే జాతి శాఖలు కానిచో వీరందరిలో సమానంగా కన్పించే సాంస్కృతిక అంశములకు జన్మస్థలమేది? అను సమస్యలపై పండితులలో ఏకాభిప్రాయంలేదు

ద్రావిడ జాతులలో కొన్ని శాఖలు వాయువ్య సరిహద్దులగుండా మిక్కిలి ప్రాచీన కాలమున భారతదేశమున ప్రవేశించిరని కొందరి చరిత్రకారుల తీర్మానము బెలూచిస్థాన్‌లోని బ్రాహుయీ భాషను తమ సిద్ధాంతమునకు నిదర్శనముగా వీరు ఉదహరిస్తారు అదీకాక ఆంధ్ర, ములక, పఠ్ఠావాదిజాతు లొకానొకప్పుడు వక్షానదీ తీరంలో నివసించినట్లు బ్రహ్మాండాది పురాణములలో చెప్పబడింది వక్షన దియే ఆక్సస్ చారిత్రక యుగమున పైజాతులలో చాలాభాగము దక్షిణా పథమున కనిపిస్తున్నారు ఈ చారిత్రకాంశము ద్రావిడులు మధ్య ఆసియా ప్రాంతములనుండి దక్షిణ భారతమునకు వలసవచ్చినా రనే సిద్ధాంతాన్ని బలపరుస్తున్నది

భారతదేశం నుండియే - అందునూ దక్షిణాపథం నుండియే ద్రావిడజాతులు ఉత్తరాపథానికి, అటునుండి మధ్యదరా ప్రాంతభూములకు వలస వెళ్ళినారని హీరాస్‌వంటి పండితులు నిర్ణయించినారు ఈ సిద్ధాంతమునకు సైతము కొన్ని బలవత్తరమైన ఉపపత్తులే ఉన్నాయి ప్రాచీన ఈజిప్షియన్ సారస్వతమున ఈజిప్షియనులు 'పంట్' దేశంనుండి వచ్చినట్లు చెప్పబడినది పంట్ దేశమే పాండ్యదేశ మని హీరాస్ పండితుని అభిప్రాయము కాని కొందరు చరిత్రకారులు పంట్ దేశము 'సాకొత్రా'గా భావిస్తున్నారు ఈజిప్టు నేలిన తొమ్మిదవ రాజవంశము వారికి 'పాటలా' జన్మస్థలమట! ఈజిప్టునకిది తూర్పుదిశ నున్నదనీ, పెక్కునదులతో నేర్పడిన డెల్టా భూమియనీ వర్ణించబడింది ఈ వర్ణనకు సింధునదీ ముఖద్వారము సరిపోతున్నది సింధునదీ ముఖద్వారముననే పాటలా నగరమున్నట్లు గ్రీకు చరిత్రకారులు పేర్కొన్నారు ఐనచో పాటలా నుండి ఈజిప్టుకు వెళ్ళే మార్గంలో సాకొత్రా, అనగా పంట్ దేశము మజలీస్థలమై ఉంటుంది, మహాభారతంలో నాగమాతయైన కద్రువ తన కుమారులను సముద్రం మీదుగా 'రామణీయక దేశము'నకు గొనిపొమ్మని గరుత్మంతుని ఆదేశించింది కల్నల్ విల్‌ఫర్డ్ పరిశోధనల ప్రకారమీ 'రామణీయక దేశము' ఈజిప్టు దేశమే మరొక విశేషమేమిటంటే గ్రీకుల పాటలీ దేశమే మన ఇతిహాసపు రాణాలలోని పాతాళమని విమర్శకుల అభిప్రాయము పాతాళలోకమే నాగలోకము ఈ అంశాల పరిశీలనవలన నాగజాతి ప్రజలు కొందరు భారతదేశం నుండి ఈజిప్టుకు వలసవెళ్ళిరనే అభిప్రాయం కలగటం సహజమే

అయితే పరస్పర విరుద్ధాలైన ఇట్టి నిదర్శనాలు ఆధారంగా ద్రావిడజాతుల జన్మస్థలమును ఇదమి ద్ధంగా నిర్ణయించడం సాధ్యంకాదు కాని ఒక విషయం మాత్రం సత్యము ప్రపంచరంగస్థలముపై ఆర్యజాతు లడుగిడక పూర్వమే మధ్యదరా ప్రాంత జాతులనబడే ద్రావిడజాతులు ఆసియా, ఐరోపా, ఆఫ్రికాలలోని పలుదేశాలలో విస్తరించి ఉదాత్తమైన నాగరికతా సంస్కృతులకు దృఢమైన పునాదులు నిర్మించినారు ఈ పునాదులు మరుగునపడునట్లుగా ఇటీవలికాలమున కలుషితమైన మత రాజకీయ జాతీయవాదాలు బలిసి ప్రజలలో కృత్రిమమైన భిన్నత్వాన్ని రెచ్చగొట్టినాయి కానీ నేడు కనిపించే భిన్నత్వం అడుగున ప్రాచీనమైన సాంస్కృతిక సమైక్యం కలదనటంకూడ సత్యమే ఆ సత్యాన్ని గుర్తించటం చాల అవసరం ఏనాటికైనా ఆసియా అధికభాగంలో సుస్థిర శాంతిస్థాపన కా సత్యంపై సాధనము శరణ్యము కాగలదు. ★

# సోషలిస్టు వ్యవస్థలో మార్పులు వాటి ప్రాముఖ్యత

ప్రొ॥ వి.వి. కృష్ణారావు

పూర్వపు సోవియట్ యూనియన్‌లోను, సోషలిస్టు దేశాలలోనూ వచ్చిన వ్యవస్థాగత మార్పు కలుగజేసిన దిగ్భ్రాంతి ప్రకంపనాలు క్రమంగా సమసిపోయినాయి. అంతమాత్రాన ఆ విషయాలను మరచిపోవచ్చుననుకోరాదు అవి ఈ శతాబ్దంలో అన్నిటిని మించిన ప్రాముఖ్యముగల సామాజిక పరిణామాలు, వాటినుండి నేర్చుకోవలసిన సారాలెన్నో ఉన్నాయి.

చరిత్ర సామాజిక పరిణామాన్ని సూచించే బృహద్గ్రంథం. ఈ మార్పులు అతి ఆధునికమైన చరిత్ర. నిన్నా, మొన్నటి సంగతులు. రెండవ విషయం - కొత్తగా విలసిల్లిన సమాజం మారటం - మరింత ప్రాముఖ్యాన్ని సూచిస్తుంది కమ్యూనిజం తర్వాత సమాజంలో ఇంకా మార్పులు వస్తాయా? ఎలాంటి వ్యవస్థ ఆ తదుపరి వస్తుంది? అనే ప్రశ్నకు ఇటీవలి వరకూ ఎవరూ సమాధానమివ్వగలిగేవారు గాదు ప్రపంచమంతా కమ్యూనిజం వ్యాపించినప్పుడు, ఉత్పన్నమయ్యే సమస్యగా దానిని కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని నమ్మేవారంతా వాయిదావేసేవారు. కాని ఈ ప్రశ్నకు ఇప్పుడు సమాధానం వెంటనే చెప్పవలసిన ఆవశ్యకత, అవకాశం వచ్చింది. అందుచేత కూడా పూర్వపు సోషలిస్టు ప్రపంచంలో ఇప్పుడువచ్చే మార్పులను, ఆ చరిత్రను చాలా ఆసక్తిదాయకంగా గమనించాల్సిన అవసరం వుంది. మార్క్సిస్టు సిద్ధాంతం, చరిత్రను మథించి రాబట్టిన సారాంశం అనేది ఈ సందర్భంలో

పూర్వపు సోవియట్ యూనియన్‌లోను, తూర్పు యూరప్ దేశాలలోను ప్రభుత్వాలు హఠాత్తుగా మారిపోయి వ్యాపారవ్యవస్థను (market economy) స్వీకరించాయి. వ్యాపార వ్యవస్థ అనేది స్థూలంగా క్యాపిటలిజానికి మారుపేరని చెప్పవచ్చు చైనా, వియత్నాం, ఉత్తరకొరియా, క్యూబా మొదలైన ఇతర సోషలిస్టు దేశాలలో ప్రభుత్వాలు, పాలక పార్టీలు మారకపోయినా, ఆర్థిక విధానం మాత్రం మారుతోంది. అధికారంలో ఉన్నదెవరైనా, ఈ పూర్వపు సోషలిస్టు రాజ్యాలన్నీ వ్యాపార వ్యవస్థలోకి మారుతున్నాయనేది మాత్రం అందరూ చూడగలిగే సత్యం.

ఈ మార్పుకి కారణాలను కనుగొనడం మార్క్స్ సిద్ధాంతంలో విశ్వాసమున్న వారందరికీ ప్రథమ కర్తవ్యం లేకపోతే నూతన సమాజ నిర్మాణంకోసం జరిగే ప్రయత్నాలు, ఉద్యమాలు చుక్కానిలేని పడవల్లాగా గమ్యంలేకుండా గాలికి కొట్టుకుపోతాయి.

సోషలిస్టు వ్యవస్థ ఈ విధంగా మారడాన్ని మూడు విధాలుగా అవగాహన చేసుకోవచ్చు. సామాజిక పరిణామక్రమాన్ని గమనించకుండా, కమ్యూనిజం నశించిందే అని వాపోయేవారు కొందరు. దాని పీడ విరగడయ్యిందని సంతోషించేవారు మరికొందరు. మరొక విధంగా ఆలోచించేవారు కూడా వున్నారు. ఏవో కొన్ని తప్పులు, కొంతమంది నాయకులు చెయ్యడంవల్ల, సోషలిస్టు వ్యవస్థ పతనమయ్యిందనేది వారి వాదన ఆ తప్పులను సరిచేసుకుని మరల సోషలిస్టు వ్యవస్థను సాధించవచ్చునని వారి నమ్మకం.

కాని ఈ తప్పులను గురించి, వాటిని సరిజేసే మార్గాల గురించి అవసరమైన వివరణ మాత్రం ఇప్పటివరకు రాలేదు మరొక విధంగా కూడా ఈ పరిణామాలను విశ్లేషించవచ్చు క్యాపిటలిజం పరిపక్వం కాకముందే రష్యాలో విప్లవం వచ్చింది అందుచేత అక్కడ ఏర్పడిన సోషలిస్టు వ్యవస్థ సుస్థిర ఆర్థిక పునాదులు, శ్రామిక వర్గంయొక్క అండదండలు లేక అస్థిరత్వానికి గురైంది ఇప్పుడు వ్యాపార వ్యవస్థ (market economy) విధానాన్ని చేపట్టి క్యాపిటలిజం దాని పూర్తి పరిణతి దిశకు చేరే సాంఘిక రాజకీయ పరిస్థితులు కల్పించబడుతున్నాయి అనగా క్యాపిటలిస్టు పంథా నుండి వైదొలగి ప్రక్కదారిన బట్టిన ప్రయాణం మరల ప్రధాన పంథాలోకి వచ్చి ముందుకు సాగుతుందన్నమాట ఇదికూడ చేసిన తప్పుని దిద్దుకోవడమనే ఆలోచననే వ్యక్తం జేస్తుంది

సోషలిస్టు వ్యవస్థ పతనానికి కారణాలను కనుగొనడం లోతైన పరిశోధనతోను, అధ్యయనంతోను కూడినపని అదీగాక ఒక రోజులో తేలేదికూడా కాదు. అయినా అది నిర్వహించి తీరవలసిన కృషి

ఈ వివిధ ధోరణులను కొంత వివరంగా పరిశీలించాలి మొదటి ఆలోచనాధోరణి ప్రకారం పూర్వపు సోషలిస్టు ప్రపంచంలో వచ్చిన మార్పులు సామాజిక పరిణామంలో ఒక దశ మార్క్స్ పరిశీలన ప్రకారం, వర్గరహితమైన ఆదిమ కమ్యూనిస్టు సమాజం, ఉత్పత్తి సాధనాలు సాంకేతిక ప్రగతిమూలంగా అభివృద్ధి చెందడంవల్ల వర్గసమాజంగా మారింది ఇదొక వ్యతికరణం (Negation) ఈ విధంగా ఏర్పడిన వర్గసమాజం బానిసత్వం భూ స్వామ్యవిధానం, క్యాపిటలిజం అనే దశలద్వారా పరిపక్వం చెంది వర్గ రాహిత్యాన్ని పొందింది. అదే సోషలిజం. అనగా సోషలిజం మరొక వ్యతికరణం. ఈ వర్గ రహిత సమాజం ఉత్పత్తి సాధనాలను ఉపయోగించుకోలేని వ్యవస్థగా రూపొందింది కొత్తగా రూపొందిన సాంకేతిక విజ్ఞానం - అనగా అణుశక్తి, ఎలక్ట్రానిక్ పరికరాలు, కంప్యూటర్లు , రోదసీయానం మొదలైన అత్యాధునిక సాంకేతిక విప్లవం, ఉత్పత్తి సాధనాలను ఉత్పత్తి పరిమాణాన్ని అనూహ్యంగా పెంచాయి. ఈ సాధనాలను సోషలిస్టు వ్యవస్థ తనలో ఇముడ్చుకోలేకపోయింది ఉత్పత్తి శక్తులు ఉన్న వ్యవస్థలో ఇమడజాలనప్పుడు కొత్త వ్యవస్థ ఆవిర్భవించుతుందని మార్క్స్ సూచించాడు వ్యవస్థలు మారడం చరిత్ర లక్షణం అందుచేత కొత్త వ్యవస్థ యొక్క అవసరం ఏర్పడింది. దాని ఫలితంగా సోషలిస్టు వ్యవస్థ మరొక వ్యవస్థకు స్థానాన్ని కల్పించింది ఇదికూడా ఒక వ్యతికరణమే. ఈ విధంగా ఏర్పడిన ఆమరొక వ్యవస్థే వర్తక వ్యవస్థ వర్తక వ్యవస్థకీ, పెట్టుబడిదారీ వ్యవస్థకి కొన్ని విషయాల్లో పోలిక వున్నా దాని నకలు మాత్రం కాదు. మరొక రూపంలో ఆవిర్భవించిన వర్గసమాజం. వర్గరహిత సమాజం వర్గాలతో కూడిన సమాజంగా మారడం, ఆదిమ కమ్యూనిజం నాడు వలె ఈనాడుకూడా శాస్త్ర సాంకేతిక అభివృద్ధివల్ల కలిగిన పరిణామం. అనగా సమాజ పరిణామంలో రెండవ పరిభ్రమణం మొదటి దానితో పోల్చితే ఉన్నతస్థాయిలో ఉంటుంది అంతేకాని చర్విత చరణంగా గాని, చరిత్ర పునరాగమనంగా గాని వుండదు ఇది మార్క్స్ చెప్పిన గతితార్కిక ప్రక్రియ

రెండవ ఆలోచనా విధానాన్ని పరిశీలించుదాం. వ్యక్తుల పొరపాట్లవల్ల సోషలిస్టు పరిణామం తప్పుదారి పట్టింది. తప్పులను సరిజేసుకుని మరల ఆ సోషలిజాన్ని నిర్మించుకోవచ్చు అనేది ఈ ఆలోచన. ఈ ఆలోచనలో రెండు అంశాలను గుర్తించాలి. వ్యక్తుల తప్పు ఒప్పులతో చరిత్ర గమనం నిర్ణయించబడుతుందనడం మార్క్సిస్టు గతి తార్కికానికి పూర్తి వ్యతిరేకం. సామాజిక శక్తులు చరిత్రపరిణామానికి చోదకశక్తులు. వ్యక్తుల పాత్రవల్ల ఆ పరిణామ ప్రక్రియ త్వరిత మవడంగాని, మందగించడంగాని జరుగుతుంది గాని, దాని స్వభావాన్ని మాత్రం మార్చజాలదు. రెండవ అంశం ఏమిటంటే తప్పులను సరిదిద్దుకుని మరలా సాధించే సోషలిజం పాత సమూనా గాక మరొక విధంగా వుంటుంది. కాని,

అదేరకమైన వ్యవస్థ రావడం, చరిత్ర పునరావృత్తం కావడమే. అది చరిత్ర గమనానికే విరుద్ధం. ఈ అంశాన్ని కూడా మార్క్సు స్పష్టం చేశాడు. అయితే ఈ క్రొత్త నమూనా సోషలిజం ఇప్పటివరకు క్యాపిటలిజంలో వున్న దేశాలకు లక్ష్యం కావచ్చుకాని, సోషలిజాన్ని కొంతకాలం అనుభవించి వ్యాపార ఆర్థిక వ్యవస్థలోకి మారిన దేశాలకు మాత్రం తక్షణ (immediate) ఆదర్శం కాజాలదు

మార్కెటు ఎకనమీ, ఇటీవల వరకూ ఉన్నక్యాపిటలిజానికి భిన్నంగా రూపొందుతోంది అంటే ఇప్పటివరకు క్యాపిటలిజంలో మనం చూస్తున్న లోపాలు అదృశ్యమౌతాయనికాదు కొన్ని సమసిపో వచ్చు. కొన్నిటి తీవ్రత తగ్గవచ్చు. కొన్ని కొత్త లక్షణాలు పొడచూపవచ్చు కొత్తగా రూపొందే ఈ వర్తక వ్యవస్థ ప్రపంచవ్యాపితమైన వ్యవస్థగా విస్తృత మౌతోంది. ఆర్థిక వనరులు, ముడి సరుకులు, శ్రమ విలువ, వివిధ దేశాల జీవన ప్రమాణాలలో ఉన్న వ్యత్యాసాలు ప్రపంచంలో పనిచేస్తున్న ఆర్థిక సంస్థల విధానాలను ప్రభావితం చేస్తున్నాయి ప్రపంచబ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి, బహుళజాతి సంస్థలు ఇప్పటికే ప్రపంచాన్ని ఆవరించి ఒక భౌగోళిక వ్యవస్థ రూపాన్ని సంతరించుకున్నాయి ఈ వ్యవస్థలో భాగంగా అంతర్లీనం కాగలిగిన దేశాలు మాత్రమే మనగలవు అందుచేతనే భారతదేశంకూడా ఈ ప్రపంచ మార్కెట్టులోకి ప్రవేశించటానికి తన ఆర్థిక విధానాన్ని సరళీకృతం చేసుకోడానికి, సంస్కరించుకోడానికి ప్రయత్నిస్తోంది. ఏదేశమైనా ఈ ప్రాపంచిక వ్యవస్థకు దూరంగా వుండి మనలేదు ఈ నూతన భౌగోళిక ఆర్థిక శక్తుల ప్రాబల్యానికి అనుగుణంగా మారడానికొరకే పూర్వపు సోషలిస్టు దేశాలు వాటి వ్యవస్థను మార్చుకున్నాయి. కొన్ని మార్చుకుంటున్నాయి. ఆవిధంగా క్రొత్తశాస్త్ర సాంకేతిక విప్లవంవల్ల ఏర్పడ్డ భౌగోళిక ఆర్థిక వ్యవస్థలో అన్ని దేశాలలో ఇమడగల దేశాలు మాత్రమే ఆర్థిక ప్రగతిని సాధించగలవు ఇది రాబోయే శతాబ్దం యొక్క ప్రత్యేక లక్షణం దీనిని బట్టే రాజకీయ వ్యవస్థలు కూడా రూపొందుతున్నాయి ఈ పరిణామాలు మార్క్సుగాని, లెనిన్‌గాని ఊహించలేదు. అసలు ఊహించడం కూడా సాధ్యంకాదు. అలాంటప్పుడు పాత సిద్ధాంతాన్ని క్రొత్త పరిస్థితులకు యాంత్రికంగా తొడగటానికి చేసే యత్నాలు సఫలం కావు కొత్త పరిస్థితులకు సరిపోయే క్రొత్త విధానాలను రూపొందించుకోవాలి అదే సరియైన గతి తార్కిక ఆలోచన మార్క్సిజం అజరామరం అనివాదించడం అదొక వేదమని చెప్పడమే మార్క్సిజం ఎప్పటికప్పుడు కొత్త పరిస్థితులకు అన్వయించుకోవాలని చెప్పడం వింటాము ఆవిధంగా చెప్పడం కూడా ఒక పిడివాదంగా తయారైంది. చెప్పడం మాత్రమేగాని, ప్రయత్నంమాత్రం కనిపించడంలేదు అట్లా చెపుతూనే 19వ శతాబ్దంలో మార్క్సు చెప్పింది, 20వ శతాబ్దం ఆరంభంలో లెనిన్ చెప్పిన సూత్రాలను యాంత్రికంగా ఆచరించడం మార్క్సిస్టు గతితార్కికం కానేరదు మార్క్సు సిద్ధాంతాలను లెనిన్ విస్తృత పరిచాడు అందుచే లెనినిజం అనేపేరు వచ్చింది అదే విధంగా మావో కొన్ని నూతన భావాలను మార్క్సిస్టు ఆలోచనా ధోరణిలో ప్రవేశపెట్టాడు అందుకే మావోయిజం అనేది ప్రాచుర్యంలోకి వచ్చింది మార్క్సిజం మారటం తథ్యం. ఈ మార్పుల పర్యవసానం ఆ సిద్ధాంతానికి ఆ పేరే వుంటుందా? లేక మరొక నామాన్ని ధరించుతుందా? అనేది సమస్యకాదు అది మారుతుందనేదే మనకు ఆసక్తికరమైన విషయం. ''ప్రతిదీ మారుతుంది. మార్పనేది తప్ప''దని ఏంగిల్స్ చరిత్ర సారాంశాన్ని, నియమాన్ని, రహస్యాన్ని చాలా క్లుప్తంగా, సూటిగా, సునిశితంగా, చిన్నయసూరి బాలవ్యాకరణ సూత్రం లాగా నిర్వచించాడు.

ఇలాంటి చేర్పులను, మార్పులను అంగీకరించలేని వారు యథాతథ వాదులుగా మిగిలిపోతారు. ఆలోచనా ప్రగతికి దోహదం చెయ్యలేకపోగా తెలిసో తెలియకో అవరోధాలుగా మారుతారు. కాని చరిత్ర పరిణామాన్ని మాత్రం ఆపలేరు. ★

— 'విశాలాంధ్ర సౌజన్యంతో'

# ఆధునిక చిత్రకళ

- మాకినీడి సూర్యభాస్కర్

చిత్రకళా ప్రదర్శన జరుగుతోంది ప్రదర్శింపబడ్డ చిత్రాలన్నీ ఆధునికమైనవే

చూస్తోన్న ప్రేక్షకులలో చిత్రకళ గురించి అంతగా అవగాహనలేని ఒకాయన ఒక చిత్రంముందు మాత్రం నిల్చొని తదేకంగా చూస్తోన్నాడు. కిటికీలోనుంచి కనబడుతోన్న దృశ్యం సంధ్యాసమయం స్వర్ణకాంతితో మెరిసిపోతున్న ఆకాశంలో రేఖామాత్రంగా నల్లని మబ్బులు, అక్కడక్కడా. చిత్రంలో ఒక ప్రక్క కొబ్బరిచెట్టు మ్రాను, మరో ప్రక్కనుంచి ఏదో చెట్టుకు సంబంధించిన కొమ్మ మాత్రమే కనబడుతోంది కొమ్మపైన ఊదారంగుపూలు, నారింజ వర్ణంతో కనబడుతూ అక్కడక్కడ గుత్తుల్లా ఉన్నాయి కొబ్బరిమ్రానులోని నలుపురంగుకు బ్యాలెన్సింగ్‌గా కొమ్మమీద నల్లనికాకి ఒకటి ఉంది

చూస్తోన్న ఆ వ్యక్తి అసంకల్పితంగా అన్నాడు, తన ప్రక్కనే నిల్చొని చూస్తోన్న వ్యక్తితో, ''అన్ని చిత్రాలలోకీ యిదే బాగుంది. సహజంగా. చిత్రంలో ఏం ఉందో అర్థమౌతోంది'' ఆ రెండో వ్యక్తి వస్తోన్న నవ్వును ఆపుకోలేకపోతూనే చెప్పాడు. ''ఇది చిత్రం కాదండీ నిజంగా కిటికీయే''నని. మొదటివ్యక్తి ముఖం అయోమయంగా మారిపోగా అన్నాడు, ''ఏమోనండీ, నాకు అన్ని చిత్రాలు అయోమయంగా అనిపించినయ్. ఒక్కటీ అర్థం కాలేదు. ఇదేనా ఆధునిక చిత్రకళంటే?!''

నిజంగానే నేటి ఆధునిక చిత్రకళలో అయోమయం పాలు ఎక్కువైంది. భావం క్లిష్టంగాను, చిత్రణ అయోమయంగాను ఉంటే చిత్రం గొప్పదవుతుందనే అపోహ కొందరు చిత్రకారుల్లో సైతం లేకపోలేదు.

అయితే, ఆధునిక చిత్రణా పద్ధతులు చిత్రకారునికి ఒక వరం. ఎందుకంటే, ఏదైనా ఒక భావాన్ని సాంప్రదాయ పద్ధతిలో చిత్రించేటప్పుడు సూత్రపరంగా, సాంకేతికపరంగా ఎన్నో పరిమితులు ఉంటాయి సాంప్రదాయ పద్ధతిలో ఎంత నైపుణ్యంతో చిత్రించినా, ఈ పరిమితులవల్ల చిత్రకారుడు తన చిత్రంలో తానాశించిన రసాన్ని సృష్టించలేకపోవచ్చు. ఉదాహరణకు 'పాములవాడి' చిత్రాన్నే తీసుకుందాం. మామూలు సాధారణ చిత్రణా పద్ధతుల్లో ఒక పాములవాడు నాగస్వరం ఊదుతోన్నట్లు. . వాడికి ఎదురుగా పాము పడగవిప్పి లయబద్ధంగా నాట్యం చేస్తున్నట్లు చిత్రించవచ్చు అమితోత్సాహంతో తిలకిస్తోన్న ప్రేక్షకుల్నీ కొందర్ని చిత్రించవచ్చు అయితే ఆధునిక చిత్రణా పద్ధతిలో, చిత్రంలో 'పాములవాడు' ఉండనవసరమే లేదు. నాదస్వరం ఊదుతోన్న పెదవుల్ని చిత్రించినా సరిపోతుంది. లేదా, పాములవాడు ఊదే నాదస్వరాన్నే నృత్యగతిలయల్లో చూపిస్తూ, వాటి ఎదుట లేని (చిత్రించబడని) పాము నాట్యాన్ని స్ఫురించవచ్చు. ఈ విధంగా ఆధునిక చిత్రకళలో చిత్రకారుడు తనకు కావలసిన రీతిలో తన భావం తాలూకు ఒక అంశాన్ని పాక్షికంగానో, పూర్తిగానో వదిలివేసి మరొక అంశాన్ని పెద్దదిగా, ప్రస్ఫుటంగా, చిత్రం మొత్తానికే ప్రాణంగా చిత్రించవచ్చు.

ఈ ఉదాహరణలో చిత్రకళ సాధారణ సూత్రమైన నైష్పత్తిక సామ్యాన్ని (proportionality) చిత్రకారుడు ధిక్కరించేశాడన్నమాట

ఈ విధంగా చిత్రకారుడు పరిమితులకు లోబడిన సాంప్రదాయ పద్ధతిలో కాక, ఆ పద్ధతులను లెక్కచేయని క్రొంగొత్త రీతుల్లో తనభావానికి అనుగుణమైన రంగుల్లోను, రేఖల్లోను ప్రాణంపోసి, ఆ భావంతో తానాశించిన ప్రత్యేకాంశాన్ని దృశ్యీకరిస్తూ ప్రేక్షకుని అనుభూతికి అందించగలడు పాములవాడికీ, అతని రూపానికీ ప్రాధాన్యతను తగ్గించేసి, నాదస్వరాన్నీ, దానిని ఊదేటప్పుడు బాగా ఉబ్బిన పాములవాడి బుగ్గల్ని మాత్రమే ప్రధానంగా ఎంచి దానిని చిత్రించడంలో వాస్తవత పొలిమేరల నతిక్రమించి విస్తృత పరచడం ద్వారా, తానాశించిన వర్ణవిన్యాసం ద్వారాప్రతిభావంతంగా చూపించగలడు

చుట్టూ ఉన్న కొండలూ కోనలు, చెట్లూ పుట్టలు, ఆకాశం, నీరు మనం నిత్యం చూసేవే. ఈ పరిచితమైన రూపాలను, స్థూల జగతి యదార్థ స్వరూపాన్నీ అదేపనిగా చిత్రిస్తూ ఏ విధంగా చిత్రకారుడు అదనపు అందాన్నీ, ఆకర్షణనూ పదేపదే చూపగలడు? భావమెంత ఉన్నతమైనా, దాన్ని ప్రతీకరించే రూపాలు సుపరిచితమైన వైనప్పుడు ఆ చిత్రంలో వెల్లడయ్యే ప్రత్యేకాకర్షణ ఏముంటుంది? - ఈ ఆలోచనలే ఆధునిక చిత్రకళావిర్భావానికి పునాది వేశాయి నూతన చిత్రణా పద్ధతులు, నూతన భావవ్యక్తీకరణ పద్ధతులు వెలిశాయి

శాస్త్ర ప్రగతితో నేటి సమాజం సంప్రదాయాలను, నియమాలను, బంధాలను ఉల్లం ఘిస్తూ. స్థూలత్వం నుంచి సూక్ష్మత్వం వైపుకు పయనిస్తోంది వివిధ విధాలైన ఆందోళన లతో ప్రశాంతత కోల్పోయిన మనోవైజ్ఞానిక సమాజం నెలకొంది నేడు కాలానుగుణంగా పెంపొందిన మానసిక చైతన్యం ఫలితంగా సంక్లిష్టమైన ఇతివృత్తాలను చిత్రించడంలో ఎదు రయ్యే ఇబ్బందులను అధిగమించే ప్రయత్నంలో రూపుదిద్దుకొంది ఆధునిక చిత్రకళ.

ప్రస్తుత సమాజం మాదిరిగానే, ప్రస్తుత కళకూడ స్థూలత్వం నుంచి సూక్ష్మత్వం దిశగా పయనిస్తోన్న మనోవైజ్ఞానిక కళ!

కవిత్వం, అక్షరగణబద్ధమైన పద్యం నుంచి మాత్రాగణబద్ధమైన గేయంగా, చివరికి ముక్తచ్ఛందమైన వచన కవితగా బంధనాలను త్రెంచుకొని నిబద్ధతనుంచి అనిబద్ధతలోనికి ఏ విధంగా పరిణమించిందో అదేవిధంగ చిత్రకళకూడ నిబద్ధతనుంచి అనిబద్ధతలోనికి పరిణమించి, ఆధునిక చిత్రకళగా అంకురించింది

సమాజంలోను, కళలలోను ఈ అనిబద్ధతకు బీజం వేసింది 1789లో జరిగిన ఫ్రెంచి విప్లవం ఆ విప్లవం మానవుని జీవన విధానంలో తెచ్చిన మార్పులు అతని అనుభవాలలో, అనుభూతుల్లో, ఆలోచనల్లో సైతం చోటుచేసుకుని చివరికి సాహిత్యంలో, సంగీతంలో, నాట్యంలో, శిల్పంలో, చిత్రంలో ప్రతిబింబించాయి.

చిత్రకళలో ఈ మార్పు మరీ అధికంగా సాగి వాస్తవంనుంచి విడిపోవడం జరిగింది. సహజరూపాలలో అన్వేషించిన సౌందర్యాన్ని అసహజరూపాల్లో సృజించడం, ప్రకృతిరూపా లను వికృతపరచి క్రొత్తరూపాలను సృజించడం, దృష్టిక్రమానికి (perspective) సంబంధిం చిన నియమాలన్నీ ఉల్లంఘించడంవంటి లక్షణాలతో ఆధునిక చిత్రకళ ఆవిర్భవించింది. దీనిలో మూడు ఆయతనాల వాస్తవికత (realism) అంతరించి రెండు ఆయతనాల చిత్రీకరణే

స్థిరమైంది అంటే రంగుల వెలుగునీడలు కాక స్వచ్ఛమైన రంగులకాంతులే ఉంటున్నాయి

ఆధునిక చిత్రకళలో ఎన్నో 'ఇజం'లు ప్రవేశించాయి - ఇంప్రెషనిజం, క్యూబిజం, సర్రియలిజం, ఫ్యూచరిజం, ఎక్స్‌ప్రెషనిజం (కల్పనావాదం)తోపాటు నైరూప్య, నైరూప్యాలు ఆధునిక చిత్రకళలో నిలచిపోయాయి వీటితోపాటు వర్ణప్రాధాన్యం, అనిబద్ధత, అవాస్తవికత, ముఖ్యంగా విశ్వజనీనత అనేవి ఆధునిక చిత్రకళ లక్షణాలు

కల్పనావాదం చిత్రకళలో సమూలాగ్రమైన మార్పును తెచ్చింది ఈ వాదం ప్రకారం, చిత్రితరూపాలు దృశ్యజగత్తులో ఏ రూపాన్నీ పోలి ఉండవు అంటే దేనికీ సారూప్యాలు కావు కొండలు కొండలుగాను, చెట్లు చెట్లుగాను గోచరించక అన్నీ రేఖాగణితరూపాలను దాల్చి అపరిచిత రూపాలను సంతరించుకొంటాయి ఈ వాదన ప్రకారం, చిత్రకారుడు బాహ్యంగా కనుపించే స్థూలజగతిని వదలివేసి అంతరంగంలో వీక్షించిన సూక్ష్మమైన అదృశ్య జగతిని అనుసరిస్తాడు. అనుకరిస్తాడు ఉన్నదాన్ని వదలివేసి లేనిదాన్ని కల్పిస్తాడు సృజిస్తాడు

ఈ కల్పనావాదమే ఇంకా పొడిగింపబడి చివరికి చిత్రకళలో రూపజగత్తును నైరూప్య జగత్తులోనికి రూపాంతర పరచింది రూపాలన్నీ రంగుల్లోనికి మారినప్పుడు ఒకానొక దృశ్యమానమైన వర్ణసంగీతం వినిపిస్తుంది ఇదే ఆధునిక చిత్రకళలో పరాకాష్ఠ!

నైరూప్య చిత్రణలో కేవలం రేఖలు, రంగులు తప్ప ఇతివృత్తం ఏమీ ఉండదు ఈ విధానంలో కనిపించేది దృశ్య జగత్తులో ఏ వస్తువుకు పోలికలేని రూపాలే అందువల్ల ఈ చిత్రణను అసాదృశ్య (non-representational) కళ అంటారు నైరూప్యత ఏ విషయాన్నీ వ్యక్తం చేయదు దాన్ని అదే వ్యక్తం చేసుకొంటుంది అంటే రంగు నిమిత్తమే రంగు, రేఖ నిమిత్తమే రేఖ. అంతేకాని మరో విషయాన్ని వ్యక్తం చేయవు. ఈవిధంగా కళాసృష్టికి స్వతంత్ర ప్రతిపత్తి నైరూప్యచిత్రణలో లభిస్తుంది

చిత్రకారుని అవచేతనంలో (Sub-conscious) సంచలనం కలిగినప్పుడు ప్రకృతిలోని ఏ ఆకారంతోను సాదృశ్యం కాని కొన్ని అసాధారణ రూపాలను దర్శిస్తాడు. ఆ దర్శించిన రూపాలు బుద్ధియొక్క హేతువుకు అతీతంగా స్వప్నంలో గోచరించే రూపాల్లో ఉంటాయి. ప్రతిరూపానికీ బహిరాకారమేకాక ఆంతరంగిక ఆకారం ఒకటుంటుంది ఈ ఆకారం మానవుని అవచేతనలో మార్పు కలిగినప్పుడే సంభవిస్తుంది. ఈ రకంగా నైరూప్యచిత్రణ అనేది పూర్తిగా సాదృశ్య చిత్రణా కాదు; ఊహా చిత్రణా కాదు. అది వస్తువుయొక్క బాహ్యరూపాన్ని కాక దానిలో యిమిడి ఉండే సూక్ష్మరూపాన్ని చిత్రిస్తుంది. ఇదే నైరూప్య చిత్రకళాధర్మం నైరూప్య కళాసృష్టిలో రంగుల రూపాలకే ప్రాధాన్యం కాని వస్తురూపాలకు కాదు అందువల్ల ఆధునిక చిత్రకళలో సరిక్రొత్త రంగులరూపాల సృజన ప్రస్తుతం నెలకొని ఉన్న ధోరణి. భావంతో పనిలేకుండా కేవలం రంగులరూపాలు వస్తురూపంలో సంబంధంలేని అస్తిత్వాన్ని చిత్రానికి ప్రసాదించి ప్రేక్షకుని రసానుభూతిలో ముంచుతుంది. ఇదే దృశ్య మాధురి

ఆధునిక చిత్రకళ అంటే కేవలం నైరూప్యమని కొందరి భావన. అది వైరూప్యం కూడ. అంటే వస్తురూపాలను విరూపపరచి (distortion) చూపించడం. దీనిప్రకారం వాస్తవంలో

గుండ్రంగా ఉండే చక్రం పలకలు తేరి కోణీయంగా ఉండవచ్చు. ఈ విధంగా వైరూప్య చిత్రణలో ఇతివృత్తం అనేది అసహజరూపంలోనికి విరూపించబడుతుంది. చిత్రిత రూపాలు మనిషిరూపంగానో, జంతు రూపంగానో, రాయి రూపంగానో, రప్ప రూపంగానో లేదా మరేదో ఒక రూపంలో గోచరిస్తాయి. అంతేకాక వైరూప్య చిత్రణలో ఒకేమారు అన్ని కోణాలను చూపవచ్చు (simultaneous representation) మనిషిని ముందునుంచి చూసినప్పుడు మామూలుగా ముఖం మాత్రమే కనబడుతుంది. కాని, నైరూప్యంలో ముఖం ముందుభాగంతోపాటు వెనుకభాగమూ కనబడవచ్చు. అలాగే మనిషిని ఎడమ నుంచి చూసేటప్పుడు మామూలుగా ఎడమవైపు భాగాలే కనిపిస్తాయి కాని, వైరూప్యంలో ఎడమ వైపు భాగాలతోపాటు కుడివైపు భాగాలూ కనబడవచ్చు ప్రముఖ చిత్రకారుడు పికాసో చిత్రాల్లో ఈ వైరూప్యత చరమస్థాయిని అందుకొంది

ఆధునిక చిత్రకళ నేడు విశ్వజనీనమై ప్రపంచమంతటా వ్యాపించి ఉంది. ఈ విధానాన్ని బట్టి ఒక చిత్రం ఏ దేశానికి చెందినదో చెప్పలేం ఏ ప్రాంతానికి చెందినదో చెప్పలేం. ఏ జాతికి చెందినదో చెప్పలేం ఈ విధంగా చిత్రకళ జాతీయతా ముద్రను అధిగమించి అంతర్జాతీయ స్థాయికి ఎదిగింది.

అయితే ఒకటి, ఆధునిక చిత్రకారులు నైరూప్య చిత్రాలను చిత్రిస్తున్నారు. కాని వాటిని తిలకించే ప్రేక్షకులు మాత్రం వాటిని ఆనందించలేకపోతున్నారు. నైరూప్య చిత్రకళను అర్థం చేసుకునే స్థితికి ప్రజలు చేరలేదని చిత్రకారులంటున్నారు. అసలు చిత్రించే చిత్రాలకు అర్థం ఏమిటో, పరమార్థం ఏమిటో కనీసం చిత్రించే చిత్రకారులకైనా తెలుసునా అని ప్రజలు అంటున్నారు ఇది పాక్షికంగానైనా సత్యమే కాదనలేం.

నైరూప్య చిత్రకళ అంటే ఏమిటో తెలియకుండా అటువంటి చిత్రాలను చిత్రిస్తూన్న చిత్రకారులు కొందరైనా లేరనడం అసత్యమే కాగలదు. చిత్రకారుల్లో ఈ నిజాయితీ లోపించాక వైరూప్య, నైరూప్య, అవాస్తవిక, ఆధునికతా ముసుగుల్లో ఎన్ని వెర్రివేషాలైనా వేసే అవకాశమూ ఉంది.

నేడు ఎక్కువగా జరుగుతున్నదీ అదే. ఆవిధంగా ఆధునిక చిత్రకళ సామాన్య ప్రజానీకానికి చేరువ కాలేకపోతుంది. అంతేకానీ, పాపం, ఆదోషం ఆధునిక చిత్రకళది మాత్రం కాదు.

*"Today, as the world hurtles out of the industrial age and into a new century, much of what we know about both war and anti-war is dangerously out of date. A revolutionary new economy is arising based on knowledge rather than conventional raw materials and physical labor. This remarkable change in the world economy is bringing with it a parallel revolution in the nature of warfare· Anti-wars must match the wars they are intended to prevent."*

# వ్యక్తిత్వ వికాసం

- సి. నరసింహారావు

ఫలానా వ్యక్తి దృక్పధం మీపట్ల ఎలా వుంటుంది? ఇతర విషయాలపట్ల అతని అభిప్రాయాలెలా వుంటాయి? మనకు ఖచ్చితంగా తెలియదు. అతను ఎప్పుడో ఒక సందర్భంలో, మిమ్మల్ని గురించి మంచి అభిప్రాయం వ్యక్తం చేయలేదని విని వుంటారు. ఇక అతను మీకు సన్నిహితుడు కాదని, మీ శ్రేయోలాభిలాషికాదని నిర్ణయించేస్తారు. మీరు ఇక్కడ ఒక విషయం గమనించాలి. మీరు నిర్ణయిస్తోంది, అతనిపట్ల మీకున్న అభిప్రాయాన్నేగాని అతని ప్రవర్తనను కాదు. మీకు మీ దృక్పధమే వాస్తవం. అంతే తప్ప వాస్తవిక జీవితంలో అతనికి మీపట్లవున్న నిజమైన అభిప్రాయమేమిటో మీరు గుర్తించలేకపోతున్నారు.

## అభిప్రాయాలకు, వాస్తవికతకు మధ్యవున్న తేడాను గుర్తించండి

మన నిర్ణయాలన్నీ వాస్తవికతపై ఆధారపడినవి కావు. ఫలానా వ్యక్తి ఫలానా రకం మనిషి అని ఎవరో చెబుతారు అదే మనం నమ్మివేస్తుంటాము. అతనితో ప్రవర్తించే సందర్భంలో కూడ, మనకు అతనిపట్ల కలిగిన పూర్వ అభిప్రాయమే, మన మనసులో కదలుతుంటుంది అంతే తప్ప, మనతో అతని ప్రవర్తనను సమీక్షించి, అతను ఎటువంటివాడో నిర్ణయించడానికి సమాయత్తం కాము ఇలా ప్రతిదానిని గురించిన పూర్వ నిర్ణయాలు, మన ప్రవర్తనను ఎంతో క్రుంగదీస్తుంటాయి. ఇక్కడే మీరు మీ జీవితంలో ఒక తికమకకు లోనవుతుంటారు. మీరు రకరకాల సంబంధ బాంధవ్యాలు నెలకొల్పుకుంటోంది, మీ చుట్టూ ఉన్న వాస్తవిక ప్రపంచంతో కాని, ఆ వాస్తవ ప్రపంచాన్ని మీరు యథాతథంగా చూడలేకపోతున్నారు. 'ఫలానా కులానికి చెందిన వ్యక్తుల్ని నమ్మకూడదు. ఫలానా మతానికి చెందిన వ్యక్తులు చాల దుర్మార్గులు', ఇటువంటి అభిప్రాయాలు మనకు ఇంతకు ముందే కలిగి ఉంటే, ఆ కులానికి, మతానికి చెందిన వ్యక్తితో మీరు సవ్యంగా, సహజంగా ఎలా ప్రవర్తించ కలుగుతారు?

## మీ పూర్వ దృక్పథాలు మిమ్మల్ని తప్పుదోవ పట్టించవచ్చు

అందుకే వివిధ విషయాల పట్ల, విభిన్న వ్యక్తులపట్ల మీరింతకుముందే ఏర్పరచుకున్న నిర్ణయాలన్నింటిని, మీ మనసు మారుమూల నుండి పెకలించి, ఓసారి సమీక్షించుకోవాలి. ఈ ప్రపంచంలో అనేక సంఘటనలు, మీరు ఎదురుచూసినట్లు జరుగవు అనేకసార్లు మీరు ఆశాభంగానికి లోనుకావలసి వస్తుంది ఈ ప్రపంచాన్ని నడిపిస్తున్నది మీరుకాదు. ఈ ప్రపంచంలో ఏ భాగానికా భాగం స్వతంత్రంగా ప్రవర్తిస్తుంటుంది. ఒకరోజు ఎండ మండిపోయేలా ఉంటుంది. మరో రోజు కుంభవృష్టిలా వాన కురుస్తుంది ఇవి మీకు ఇబ్బంది కలిగించవచ్చు. కాని ప్రపంచం దానంతట అది ముందుకు సాగిపోతుంటుంది. అలాగే ఒకరోజు పిల్లి మీకెదురు వస్తుంది. 'వెధవ పిల్లి' అని దానిని తిడతారు. కాని అది అన్ని పిల్లుల లాంటిదే. దానిమానాన అది పోతోంది. అది ఎదురువస్తే మీకు శుభం జరగదన్న నమ్మకంతో మీరు దానిని తిట్టారు. అంతే తప్ప, పిల్లి ఎలా ఉందో, ఎంత అందంగా నడుస్తుందో గమనించలేకపోయారు. అంటే అక్కడ మీ స్వంత కళ్ళతో మీరు చూసింది

మీకెదురైన పిల్లిని కాదు. పిల్లిపట్ల మీకిదివరకే వున్న దృక్పథాన్ని మీరు ఇతర వ్యక్తులను, వివిధ సంఘటనలను కూడా, ఇలాగే చూస్తుంటే, అది మీకు ఎంతో నష్టం కలిగిస్తుందని, వేరే చెప్పనవసరం లేదు మీ చుట్టూ ఉన్న ప్రపంచం మీకేమీ ఋణపడిలేదు మీకు ఆనందకరమైన జీవితాన్ని అందిస్తానని హామీ ఇవ్వదు. మీరు తోటి ప్రపంచం నుండి ఏవేవో ఆశించవచ్చు. మీకు తోటివారిపట్ల సవ్యమైన దృక్పథం ఉన్నప్పుడు మాత్రమే మీరు ఆశించినవి ఈ ప్రపంచంలో నెరవేరతాయి ఎప్పుడూ గంభీరంగా, విలాసవంతమైన జీవితాన్ని గడుపుతూ, సంపన్నునిలా వ్యవహరించే వ్యక్తికి, ఆస్థిపాస్తులేమీ వుండకపోవచ్చు. పైగా అప్పుల్లో మునిగి తేలుతుండవచ్చు అతను అవసరానికి ఆదుకుంటాడని భావించి, మీరు సన్నిహితమైతే, అతను మీ దగ్గరే అప్పు తీసుకోవచ్చు ఆ వ్యక్తి ఆస్థిపాస్తులను అంచనా వేయడానికి, మీరు ఏనాడూ ప్రయత్నించకుండా, అతనిపట్ల ఓ అభిప్రాయాన్ని ఏర్పరచుకున్నారు తరువాత మీరతని చేతిలో మోసపోవచ్చు మీరు మోసపోవడానికి మూలకారణం ఏది? మీరు ఏర్పరచుకున్న దృక్పథం

అందుకే మీరు, ఒక పత్రికా విలేఖరిలా, ఎటువంటి అరమరికలు లేకుండా, మీ చుట్టూవున్న ప్రపంచాన్ని పరిశీలిస్తూ, మీకు లభించిన సమాచారంతో, ఈ ప్రపంచాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలే తప్ప, మీకున్న పూర్వ నిర్ణయాలతో, ఈ ప్రపంచాన్ని పరిశీలించబోవడం ఉచితం కాదు అలాగే గతంలో జరిగిన సంఘటనల గురించి, మీకు చేకూరిన అనుభవాలను గురించి, మీరు తల్లడిల్లుతూ కూర్చోవడం సరికాదు అవి జరిగిపోయాయి వాటిని ఇప్పుడు మార్చలేము కాని వాటిపట్ల మీ దృక్పథాన్ని మీరు సవరించుకోవచ్చు చాలమంది, తమచుట్టూ ఉన్న వాస్తవ ప్రపంచాన్ని, నిరంతరం శాపనార్థాలు పెడుతూ వుంటారు. అందరినీ తిట్టిపోస్తుంటారు తీవ్రమైన నిస్పృహను వ్యక్తం చేస్తుంటారు. ఇటువంటి వ్యక్తులు, జీవితంలో ముందుకు వెళ్ళే త్రోవలేమీ కనుపించక, నిరాశతో వెనుతిరిగారని నిర్ణయించవచ్చు

## మీకు వ్యతిరేకమయిన సంఘటనలు చోటు చేసుకొనే అవకాశాన్ని గుర్తించాలి

మీరు ఒక సన్నిహిత మిత్రునికి కొంత డబ్బు అప్పుగా ఇచ్చారు అడిగితే ఏమనుకుంటాడోనన్న మొహమాటం, సంశయాలతో మీరు ఇంత కాలము అతనిని అప్పు సంగతి అడుగలేదు. చివరకు మీకు పెద్ద అవసరంవచ్చి, అతనిని అప్పు తీర్చమని కోరారు మీరసలు ఇచ్చిన విషయమే తనకు జ్ఞాపకం లేదని, అతను బుకాయిస్తాడు మీరు నివ్వెరపోతారు. దిగ్భ్రాంతికి లోనవుతారు. అది ఇలా జరిగి ఉండవలసింది కాదని, అతను అలా అని వుండాల్సింది కాదని, మీరు ఎంతగానో మథన పడుతుంటారు. ఈ ప్రపంచంలో ప్రతి వ్యక్తి, కనీసం మీ సన్నిహిత మిత్రులైనా మీరు ఆశించినట్లు ప్రవర్తించాలని ఎదురుచూశారు అంతేకాదు. అందరూ అలాగే ప్రవర్తిస్తారని, అదే సమాజ వాస్తవికత అని, మీరు విశ్వసించారు కాని జరిగినది అందుకు భిన్నంగా వుండటంతో మీరు తల్లడిల్లిపోతున్నారు నిరంతరం అవే ఆలోచనలతో మిమ్మల్ని మీరు వేధించుకు తింటున్నారు. 'ఇప్పుడు ఒక పొరపాటు జరిగింది. ఇకపై ఇలా జరగకుండా నేను జాగ్రత్త పడతాను' అని మీరు నిర్ణయించుకో గలిగితే మిమ్మల్ని ఈ సంఘటన పెద్దగా బాధించదు.

ఇందుకు భిన్నంగా మరో సంఘటన మీకు ఎదురవుతుంది. మీకు అత్యంత అవసరమైన పని వచ్చి పడుతుంది. మీరు ఒక మిత్రుని సహాయం కోరతారు. అతను తప్పక సహాయం చేస్తానని మీకు వాగ్దానం చేస్తాడు. మీరు అతనిపై విశ్వాసంతో, మరెవరిని సహాయం చేయమని అడగకుండా, పూర్తిగా అతనిపైనే ఆధారపడతారు. తీరా అవసరం వచ్చిన రోజుకు, అతను మీకు సహాయం చేయడు. ఏవో కబుర్లు చెప్పి తప్పించుకుంటాడు అలాగే మీరు అనేకసార్లు సహాయం చేసిన వ్యక్తి దగ్గరకు పరుగెత్తుతారు అతను కూడా మీకు ఎటువంటి సహాయాన్ని అందించడు ఈ అనుభవాలతో ఈ ప్రపంచం చాల క్రూరమైనదని మీరు నిందిస్తారు కాని నిజం చెప్పాలంటే, ఈ ప్రపంచానికి ఉన్న స్వభావాన్ని, సరిగ్గా అర్థం చేసుకోలేక, ప్రపంచం మొత్తాన్నే క్రూరమైనదిగా నిందించడం జరుగుతుంది తన మిత్రులు తనతో ఇలా ఎందుకు ప్రవర్తించారని ఎంతగా తల బ్రద్దలు కొట్టుకున్నా ప్రయోజనముండదు 'ఈ ప్రపంచంలో నాకు నచ్చని విశేషాలు, స్వభావాలు అనేకం ఉన్నాయి. వాటిని మార్చి తీరాలి' అని మీరు నిర్ణయించుకోగలిగితే ఈ ప్రపంచాన్ని మీరు సవ్యంగా, నిజాయితీతో అర్థం చేసుకోగలుగు తారు

మీ అంతరంగిక మిత్రులుగా పరిగణించేవారికి, అరమరికలు లేకుండా, మీరు మీ వ్యక్తిగత విషయాలన్నీ చెబుతారు వారు ఈ విషయాలన్నీ పదిమందికీ చెప్పడం, మిమ్మల్ని గురించి చులకనగా మాట్లాడటం జరుగవచ్చు మీరు, వారిలాగా ఎప్పటికీ ప్రవర్తించరు కాని వారు, మీరు ఆశించిన దానికి భిన్నంగా ప్రవర్తించారు ఇది గమనించి, మిత్రులందరూ, క్రూరంగా, మీపై కక్షతో ప్రవర్తిస్తున్నారని అనుకోవడం తప్పు మీ చుట్టూ ఉన్నవారిలో చాలమంది ఉత్తములు ఉంటారు సామాన్యులు ఉంటారు మీరు ఆశించిన రీతికి భిన్నంగా నడిచే వ్యక్తులు ఉంటారు. ఇలా భిన్నమైన వ్యక్తులు వున్నారు గనుక, వారితో నేగలేమని, ఎవరితోనూ స్నేహం చేయలేమని మీరు ఒక నిర్ణయానికి రావడం తప్పు మీరు ఏ వ్యక్తినైనా అతని ప్రవర్తనను చూసి అర్థం చేసుకోవాలే తప్ప, అతనిపై మీకున్న కొన్ని అభిప్రాయాల సాయంతో, అతనిని గురించి నిర్ణయించి వేయడం పొరపాటు మీ అవసరానికి ఆదుకోని వ్యక్తి, తిరిగి మరోసారి మీకు అప్పు ఇవ్వవచ్చు. మీకు అప్పు ఎగ్గొట్టిన వ్యక్తి, కొంతకాలం తరువాత మొత్తం అప్పు తీర్చివేసి మీకు క్షమాపణ చెప్పవచ్చు అతను దుర్మార్గుడూ కాదు. ఇతను వంచకుడూ కాదు. ఫలానా సందర్భంలో వారి వారి ప్రవర్తన మీకు నచ్చలేదు మీ ఆలోచనలను అక్కడికే పరిమితం చేయండి

## పాత అభిప్రాయాలన్నింటిని ప్రశ్నించి తీరాలి సరైనవో, కావో నిర్ణయించుకోవాలి

మన సమాజం వేలాది కులాలుగా చీలిపోయి ఉంది ఒక కులం వారితో, మరొక కులం వారికి సహజంగా వుండవలసిన సంబంధ బాంధవ్యాలు ఉండటం లేదు అంతేకాదు వ్యక్తుల దృక్పథాలను, ప్రవర్తనలను వారి వారి కులాలను బట్టి మనం అంచనా వేయడం జరుగుతుం టుంది ఇది చాల పొరపాటు ఒక మధ్యతరగతి తండ్రి, తన కొడుకు నిమ్నకులానికి చెందిన ఒక యువతిని వివాహ మాడడానికి, ససేమిరా అంగీకరించడు ఆ యువతి సైతం ప్రతిభావంతురాలైన విద్యార్థినే! ఆమె చాల అందంగా ఉంటుంది. వారికి ఆస్తులు కూడా ఇతని కంటే ఎక్కువే ఉన్నాయి. అయినా తండ్రి ఎందుకో అభ్యంతరం చెబుతున్నాడు.

ఆ కులాన్ని గురించి, సమాజంలో తన స్థానాన్ని గురించి, అతనికి ఏవో కొన్ని పొరపాటు అభిప్రాయాలు ఉండటం కారణంగా అతను ఈ వివాహాన్ని వ్యతిరేకిస్తున్నాడు

ఎప్పటికప్పుడు జీవితంలో ఎదురయ్యే అనేక అనుభవాలు మనకు సంతోషం కలిగించేవి గానే ఉంటాయి అయినా మనం ప్రతి సందర్భంలోనూ ఆ సంతోషాన్ని అందిపుచ్చుకోలేక పోతున్నాము. ఒక పల్లెటూరు వెళ్తాము. ఆ పల్లెటూరుని గురించి మనకు ఇంతకుముందే ఒక అభిప్రాయం ఉండి ఉంటుంది చదువు సంధ్యలు లేని మనుషులు, పశువులు, ఇరుకు సందులు, పాత ఇళ్లు ఇవన్నీ మన మనసులో మెదులాడుతుంటాయి ఆ పల్లెటూరు వెళ్ళిన తరువాత, అక్కడ చెట్లను, పక్షులను, నిశ్శబ్దంగా ఉండే వాతావరణాన్ని, పైరుగాలిని, అక్కడ ప్రజలలో కనుపించే స్వచ్ఛతనూ, హాయిగా, ప్రశాంతంగా పరిశీలించి ఆనందించ లేము. అలాగే ఎడారి ఒక భయంకరమైన ప్రాంతమని ముందే ఒక అభిప్రాయం ఏర్పరుచు కున్న తరువాత, ఎడారికి వెళితే అతి విశాలమైన ప్రాంతంలో పరుచుకుని ఉన్న ఇసుకను, దాని వన్నెలను, అక్కడ అటు ఇటు తిరిగే చిన్న చిన్న జంతువులను చూసి ఏమాత్రం ఆనందించలేము అదంతా మనకొక భయంకరమైన అనుభవంగానే ఉండిపోతుంది

మీకు, ఎక్కడ ఎటువంటి అనుభవం ఎదురైనా, దానిని సంతోషదాయకంగా మలుచుకో వచ్చు. లేదా, ప్రతి అనుభవాన్ని, తల్లడిల్లింప చేసేదిగా తీర్చిదిద్దుకోవచ్చు అంటే, అంతా మీ చేతులలోనే ఉంది. మీరు ఈ ప్రపంచాన్ని ఎలా చూడాలనుకుంటే, ఈ ప్రపంచం మీకలాగే కనిపిస్తుంది. ఒకతను ఎన్నో హత్యలు చేశాడని మీరు విని వుంటారు యాదృచ్ఛికంగా మీరతని ఇంటికి వెళ్లవలసి వస్తుంది. అతను, మీరక్కడ ఉన్నంతటి సేపూ ఎన్నో మర్యాదలు చేస్తాడు మిమ్మల్ని ఎంతో గౌరవంగా చూస్తూ సంభాషిస్తాడు మీపట్ల ఎంతో అభిమానాన్ని ప్రకటిస్తాడు. మీరు ముళ్లకంపపై కూర్చున్నట్లు కూర్చుంటారు మీకు అతనిని గురించి తెలిసి ఉండకపోతే మీరతనితో గడిపిన రెండు మూడు గంటలు ఎంతగానో ఆనందించేవారు. మీ జీవితంలో ఇది ఒక విలువైన అనుభవంగా మిగిలిపోయేది తీరా మీరు బైటకు వచ్చిన తరువాత హత్యలు చేసిన వ్యక్తి మరొకరని, ఇతని పేరు, హంతకుని పేరు ఒకటే కావడంవలన, మీరు పొరపాటు పడ్డారని గుర్తించవచ్చు. ఈ విధంగానే, ప్రతి ఒక్కరూ, తమకున్న పూర్వ అభిప్రాయాల కారణంగా వివిధ సందర్భాలలో పొందవలసిన ఆనందాన్ని, ప్రశాంతతను పొందలేకపోతుంటారు

## ప్రపంచంలో మంచి చెడులు లేవు
## కేవలం మన ఆలోచనల్లోనే వున్నాయి

మనచుట్టూ వున్న ప్రకృతిలో పచ్చదనం, ఎర్రదనం వేరువేరుగా వున్నట్లే, మన చుట్టూవున్న సమాజంలో, మంచి చెడులు స్పష్టంగా విభజితమై ఉంటాయని, చాలమంది అమాయకంగా భావిస్తుంటారు. మంచి చెడు అన్నవి వస్తువులు కావు. అవి మన నిర్ణయాలు, మన ఆలోచనల కనుగుణంగా, మనం చేసే వ్యాఖ్యానాలు. మీరు అంగీకరించి ఆనందించే వాటి నన్నింటినీ మంచివని, మిగిలిన వన్నీ చెడ్డవనీ నిర్ణయించవచ్చు. అలాగే మీతో తీవ్రమైన వాగ్వివాదానికి పాల్పడిన వ్యక్తిని, మీతో, మీ అభిప్రాయాలతో విభేధించే వ్యక్తిగా కాకుండా, మిమ్మల్ని వ్యతిరేకించే చెడ్డవానిగా పరిగణించవచ్చు. అలాగే మీకు ఎదురయ్యే అవరోధాలను, మానవులలో వుండే సహజమైన లోపాలను, బలహీనతలను, చెడ్డవిగా మీరు నిర్ణయించేయ

వచ్చు. అలాగే, ఇతరులు సైతం మిమ్మల్ని చెడ్డవానిగా పరిగణించవచ్చు అలాగే మనం అన్నింటికి ఇలా మంచివని, చెడ్డవని, విశేషణాలను తగిలించి, తేలికగా అర్థం చేసుకోవడానికి అలవాటు పడ్డాము పక్కింట్లోనుండి ఉప్పుచేపల వాసన వస్తుంటుంది. ఆ వాసనను భరించలేకుండా ఉన్నామని మీరు ఆరోపిస్తుంటారు కాని పక్కింటివారు ఆ వాసన, నాటి రుచిని, ఎంతగానో ఆస్వాదిస్తుంటారు అంటే ఆ ఉప్పుచేపల వాసన వాసనే! దానికి మంచితనమూ లేదు చెడుతనమూ లేదు దానిని ఆస్వాదించే వ్యక్తులను బట్టి దాని విశేషణం మారుతూ ఉంటుంది

అలాగే, ప్రతి విషయాన్ని గురించిన తప్పొప్పుల పట్టికలు కూడా, మనకున్న తప్పు అభిప్రాయాలపై ఆధారపడి, మనం తయారు చేసుకునేవే పూర్వం రోజుల్లో శూద్రులను తాకడమే మహా పాపంగా, మనదేశంలో, ఉన్నత కులాలవారు భావించేవారు. అందుకు తగిన ప్రాయశ్చిత్తం చేసుకునేవారు అలా తాకడం తప్పు ఎలా అయింది? కేవలం వారికి ఉన్న అభిప్రాయం వల్లనే! అలాగే భర్త, వివాహమైన తరువాత కూడా, అతని తల్లిదండ్రుల బాగోగులను పట్టించుకోవడం, తప్పంటుంది భార్య పెళ్లి కాగానే భార్య చెప్పినట్లు వినడం తప్పు, అని తల్లిదండ్రులంటారు దీనిని బట్టి మనకు అర్థం అవుతున్న విషయం ఒక్కటే. ఈ సమాజంలో తప్పొప్పుల్ని ఎవరి కనుగుణంగా వారు నిర్ణయిస్తుంటారు. అంటే, ఈ తప్పొప్పులు, మన మనసులో నుండి ఉద్భవించేవే తప్ప, వాటికి ఎటువంటి వాస్తవికమైన ఉనికి లేదు

అలాగే కొందరు అందంగా ఉన్నారని, మరికొందరు అందవిహీనంగా ఉన్నారని, ఏవో కృత్రిమ కొలబద్దలతో మనం నిర్ణయించేస్తుంటాము అందం, అందవిహీనం వాస్తవ జగత్తులో లేవు. కేవలం మన ఆలోచనలలోనే ఉన్నాయి. నల్లగా ఉన్న వారు అందంగా ఉండరని, అలాగే పొట్టిగా, మరీ పొడుగ్గా, పీలగా, లావుగా ఉండటం సౌందర్యం కాదని మనం అనుకుంటుంటాము. సామాన్యంగా, సాధారణ రూపురేఖలకు భిన్నంగా ఉన్నవారిని, భిన్నమైన వారిగానే పరిగణించాలి. ఇతరులకు ఎంతో అందంగా కనుపించే వ్యక్తులు కూడా, తాము అందమైన వారం కామని కించపడుతుంటారు. ఈ భావనే వారిని నిస్తేజుల్ని చేస్తుంటుంది

మీ నోట్‌బుక్‌లో, మీరు ఈ వాస్తవ ప్రపంచంలో ఎటువంటి ఉనికి లేకుండా, కేవలం మీ మనసులోనే ఉన్న అభిప్రాయలేమిటో గుర్తించండి. మూర్ఖుడు, అందమైన స్త్రీ, మంచి వాతావరణం, రుచికరమైన పదార్థం, వికారమైన దుస్తులు, చండాలపు పని, చెత్త మాటలు, ఇటువంటివన్నీ కేవలం మన మనసులలోనే తప్ప, మరెక్కడా ఉండవు

## మనస్సుకు విశ్రాంతి కల్పించండి

రోజంతా కష్టపడిన తరువాత, శరీరానికి విశ్రాంతి ఎలా అవసరమో, ఎప్పుడూ ఆలోచనలతో మునిగి ఉండే మనసుకు సైతం, విశ్రాంతి అలా అవసరం ఎప్పుడూ రకరకాల బాధలు, అనుమానాలు, ఆవేశాలతో విశ్రాంతి లేకుండా మథనపడుతుండే మనసు, అవసరం వచ్చినప్పుడు చురుగ్గా వ్యవహరించలేదు. మీ జీవితంలో ఎదురైన అద్భుతమైన అనుభవాన్ని ఓసారి జ్ఞాపకం చేసుకోండి. ఆ అద్భుతమైన అనుభవానికి లోనౌతున్నప్పుడు మీరు ఇంకేమైనా ఆలోచించారా? అలాగే ఉత్కంఠతలూపే సినిమా చూస్తున్నప్పుడు మీరు ఇంకేమైనా ఆలోచించ

గలరా? అదే విధంగా మీ మనసును శరీరాన్ని మమేకం చేసే, మైథునంలో పాల్గొంటున్నప్పుడు, మీ మనసులో మరో ఆలోచన చొరబడగలదా? ఒక అందమైన అనుభవాన్ని పొందే పూర్తి స్వేచ్ఛను, మీ శరీరానికి అప్పగించి మీ మనసు తాత్కాలికంగా స్తంభించింది అలాగే ఒక గృహిణి అచేతనంగా వంటపనులన్నీ చేస్తుంటుంది ఆమె దేనిని గురించీ ఆలోచించదు. ప్రతిదీ ఆలోచిస్తూ, ఒకటికి పదిసార్లు మథనపడుతూ చేయబోతే ఆ వంట ఎప్పటిలా ఉండదు అలాగే అనుభవంగల ఒక డ్రైవరు కారు నడుపుతున్నప్పుడు, అన్ని నిర్ణయాలను అచేతనంగానే తీసుకుంటాడు. ఎదురుగా ఓ వాహనం వేగంగా దూసుకు వస్తుంటే, యాంత్రికంగానే డ్రైవరు స్టీరింగును తిప్పి, తన కారును పక్కకు మళ్ళిస్తాడు. అలాగే ఓ టెన్నిస్ ఆటగాడు, ఎదురుగా ఉన్న ఆటగాడి చేతిలోని రాకెట్ కదలికను బట్టి, తన కోర్టులోకి వచ్చిన బాల్‌ను కొట్టడానికి సిద్ధపడ్తాడు. అంతేతప్ప ఎదుటి ఆటగాడు బాల్‌ను ఎటు కొట్టాడో, అది ఎక్కడ పడనుందోనని, తార్కికంగా, హేతుబద్ధంగా ఆలోచించడు ప్రపంచంలోని ప్రసిద్ధ ఆటగాళ్ళంతా ఇలా అచేతనంగానే ఆడుతుంటారు వాళ్లు ఎప్పుడైతే ఆలోచించిడం మొదలు పెడ్తారో, అప్పుడు వాళ్లు ఓడిపోనడం సంభవిస్తుంటుంది

## వర్తమానాన్ని నిర్లక్ష్యం చేయవద్దు

ఇదే సూత్రాన్ని, మీకు జీవితంలో ఎదురయ్యే అన్ని సన్నివేశాలకు, అన్వయించవచ్చు మీరు ఒక పార్టీకి వెళ్తారు అక్కడ చాలమంది స్నేహితులు కలుస్తారు వారందరితో హాయిగా, అరమరికలు లేకుండా నవ్వుతూ కాలం గడపవచ్చు లేదా ఎవరే దుస్తులు ధరించారో, ఎవరే నగలు పెట్టుకున్నారో, ఎవరే బూట్లు వేసుకున్నారో గమనిస్తూ, మథనపడ్తూ కూర్చోవచ్చు. మీరు భార్యా పిల్లలతో అందమైన పూలతోట మధ్యకు వెళతారు అక్కడ ఒక గంటసేపు మీరు హాయిగా కాలం గడుపవచ్చు. అక్కడ అందమైన రంగురంగుల పుష్పాలను, వాటి సోయగాలను, వాటి చుట్టూ పరిభ్రమించే తేనెటీగలను, గాలికి వయ్యారంగా ఊగే మొక్కలను, నవనవలాడే పచ్చగడ్డిని, ఎండుటాకుల్ని, చెట్ల చిగుళ్ళని, వీటన్నిటిని చూస్తూ, తన్మయత్వంతో మిమ్మల్ని మీరు మరచిపోవచ్చు లేదా ఇంటికి తిరిగి వెళ్ళడానికి, బస్సు దొరుకుతుందో లేదో అని మథనపడుతూ, పిల్లలు అల్లరిచేస్తూ ఇతరులను ఇబ్బంది కలిగిస్తారేమోనని అనుమానిస్తూ, మీరు మీ కాలమంతటిని వృథా చేయవచ్చు ఆలోచనలు, మనకు హానికరంగా పరిణమించినపుడు, వాటి నుండి కొంత విశ్రాంతి తీసుకుంటే ఎంతో మేలు జరుగుతుంది.

## సహజంగా చేయవలసిన పనులను గురించి మథనపడవద్దు

అధికంగా భుజించి, అజీర్తితో బాధపడేవారిని, మనం అనేకమందిని గమనిస్తూ ఉంటాము వారు, వారి శరీరానికి కావలసినంత మాత్రమే భుజించరు. జిహ్వాచాపల్యం కొద్దీ, ఎక్కువ ఎక్కువగా తింటారు. ఫలితంగా స్థూలకాయం పెరిగి పోతుంటుంది అలా కాకుండా, ఆకలి పోగొట్టే వరకు మాత్రమే తినగలిగితే, ఆరోగ్యం సవ్యంగా ఉంటుంది ఇక్కడ, మనస్సు పెట్టే ప్రలోభానికి లొంగకుండా వుంటే, ఆరోగ్యాన్ని చక్కగా కాపాడుకో గలుగుతారు అలాగే, కొంతమంది నత్తితో బాధపడ్తుంటారు వారిలో శారీరకమైన ఎటువంటి లోటూ ఉండదు అయినా వారు సవ్యంగా సంభాషించలేరు ఎందుకిలా జరుగుతోంది? వారు సంభాషించే ప్రక్రియలో, ఎప్పటికప్పుడు వారి మనస్సు అడ్డు తగులుతోంది

ఫలానా పదాన్ని సరిగ్గా ఉచ్చరించలేడని, ఒకతన్ని మనస్సు హెచ్చరిస్తుంది. ఫలితంగా అతను సరిగ్గా ఉచ్చరించలేకపోతున్నాడు ఫలానా వ్యక్తితో ఎలా మాట్లాడాలో ముందుగానే, మీరు నిర్ణయించుకోవచ్చు. ఒకటికి రెండుసార్లు ఆ వాక్యాలను పైకే మననం చేసుకోవచ్చు. కాని ఆ వ్యక్తిని కలిసిన తరువాత సంభాషించే విషయాన్ని, మన శరీరానికే వదలివేయాలి. అలా కాకుండా, సరిగ్గా మాట్లాడగలమో లేదోనని మథనపడుతుంటే సరిగ్గా మాట్లాడటం సాధ్యం కానేకాదు.

మానవ ప్రవృత్తిలో ఒక రహస్యం దాగి ఉంది. మీ శరీరానికి, భరించలేనంతటి అధిక శ్రమ కలిగించితే, శరీరం మామూలు పనికూడ చేయలేనంతటి నిస్సహాయతకు లోనవుతుంది. అలాగే, మనసుకు అధిక శ్రమ కలిగించితే, మనం కోరుతున్న తీరుకు, పూర్తి భిన్నంగా, వ్యతిరేకంగా, మనసు పనిచేయడం ప్రారంభిస్తుంది ఒక పెద్ద ఉద్యోగికి జలుబు చేస్తుంది. ఆ రోజు అతను పాల్గొనవలసిన కార్యక్రమాలు అనేకం ఉంటాయి అతని ముక్కు నుండి నీరు ఎడతెగకుండా కారుతుంటుంది. అతను ఆ విషయాన్ని విస్మరించి తన పనులలో పూర్తిగా మునిగిపోతాడు. ముఖ్యమైన కార్యక్రమాలన్నీ మూడు గంటలలో ముగుస్తాయి. తిరిగి అతను ఇంటికి వస్తున్నప్పుడు, తనకు ప్రొద్దున్న జలుబు చేసిన విషయం, అతనికి గుర్తుకు వస్తుంది తిరిగి అతని ముక్కునుండి, నీరు కారడం ప్రారంభమవుతుంది. అలా కాకుండా, మనసులో నిరంతరం జలుబు చేసిందని మథనపడుతుంటే, ప్రొద్దుట్నుండి సాయంత్రం వరకు ముక్కునుండి నీరు కారుతూనే వుండేది.

## వాస్తవికతతో, మీ అభిప్రాయాలను సంధానపరచాలి

మీ అభిప్రాయాలు ఏమైనా కావచ్చు. కాని వాస్తవికత అందుకు వేరుగా ఉంటుంది. మీరు జీవితంలో ఏం సాధించాలన్నా మీ చుట్టూ ఉన్న వాస్తవికతతో, మీ దృక్పథాల్ని సంధానపరచాలి. అంటే, మీరు, మీ చుట్టూ ఉన్న సమాజంపట్ల సరైన-అవగాహనను, సవ్యమైన దృక్పథాన్ని, పెంపొందించుకోగలగాలి. మున్ముందుగా మీ దృక్పథాల్ని సవరించుకొనే శక్తి, మీకు ఉందని గుర్తించండి. ఈ దృక్పథాలన్నీ, మీ చుట్టూ ఉన్న సమాజాన్ని స్వయంగా పరిశీలించి, మీ అంతట మీరు ఏర్పరుచుకున్నవే అయితే, వాటిని మార్చుకోవలసిన పని ఉండదు. అలా కాకుండా, ఇతరుల నుండి నేర్చుకొని, మీకు గుర్తు తెలియకుండా మీ ఆలోచనలలో కలగలిసిపోయిన ప్రతి అభిప్రాయాన్నీ, మీరు ప్రశ్నించి తీరాలి. మీ నోట్ బుక్‌లో, ఇతరులనుండి మీరు నేర్చుకున్న అభిప్రాయాలేమిటో గుర్తించండి. మీకు ఇంతకు ముందు వున్న అభిప్రాయాలలో, ఏవి సరైనవో, ఏవి కావో, మీ అంతట మీరు పరిశీలించడానికి ఉద్యుక్తులు కండి. మీ మిత్రులెవరైనా తమ సంభాషణలో, విశేషణాలను అధికంగా ఉపయోగిస్తుంటే, వాటినన్నింటిని గుర్తుపెట్టుకొని, మీ నోట్‌బుక్‌లో గుర్తించండి. అలాగే ఒక వ్యక్తిని గురించి గాని, ఒక సంఘనను గురించి గాని చుట్టూ ఉన్న మిత్రులందరు ఒకే రకంగా చెబుతుండవచ్చు ఎక్కువమంది చెబుతున్నారు గనుక, మీరు విశ్వసించి తీరాలన్న నిర్బంధం ఏదీ, మీపై లేదు మీరు స్వయంగా పరిశీలించి చూసినప్పుడు, వాస్తవం వారు చెప్పిన దానికి పూర్తిగా భిన్నంగా వుంటుంది. మీరు, ఎందుకలా చెప్పారని వారందరినీ నిలదీస్తే, వారంతా తమకెవరో చెప్పటం వలన, ఇటువంటి అభిప్రాయం ఏర్పరచుకున్నామని చెపబోతారు.

అలాగే ఈ ప్రపంచమంతటినీ, మీ చుట్టూ నివసించే భిన్న వ్యక్తులను, అంచనా వేయడానికి మీరు ప్రయత్నించవద్దు స్కూల్‌లో చదివే విద్యార్థులందరినీ, వారికి వచ్చిన మార్కుల ఆధారంగా, రకరకాలుగా విభజించినట్లు, మీ చుట్టూ ఉన్నవారిని ఫలానా రకం వారు, ఫలాన రకం వారు అని విభజించడానికి, వారిని ఏవో కొన్ని కొలబద్దల సాయంతో అంచనా కట్టడానికి, ఏ మాత్రం ప్రయత్నించవద్దు మీ నోట్ బుక్‌లో మీరింతకుముందు ఏయే వ్యక్తులను, ఎలా అంచనా కట్టేవారో, ఒకసారి గుర్తించండి అలాగే మీకున్న స్నేహాలు, బంధుత్వాలు ఏవీ శాశ్వతంగా ఉండబోవని గుర్తించండి అందుకే ఏ క్షణానికి ఆ క్షణం ఉల్లాసంగా గడపడానికి నిర్ణయించుకోండి అలాగే నిరంతరం మీ మనసులో ఇతరులను గురించిన ఆలోచనలు నింపుకోవడం ఆరోగ్యదాయకం కాదు వారు మీకు భిన్నమైన వ్యక్తులని మీరు గుర్తించండి మీరు ప్రతిరోజూ, ఎవర్ని గురించి, అత్యధికంగా ఆలోచిస్తారో మీ నోట్‌బుక్‌లో గుర్తించండి. అలాగే మీరు చెప్పిన ప్రతి విషయం సరైనదేనని మీరు చిన్నపిల్లల్లా మంకుపట్టు పట్టనవసరం లేదు ఒక విషయం సరైందని మీరు నమ్ముతుండవచ్చు కాని దానిపై ఇతరుల అభిప్రాయం తెలుసుకొని, అది సరైనదో కాదో, తిరిగి నిర్ణయించగల స్వేచ్ఛ, స్వాతంత్ర్యం మీకు ఉన్నాయి అందుకే రకరకాల అభిప్రాయాల జైలుగోడల మధ్య మిగల్చకుండా, ప్రశాంతంగా, స్వేచ్ఛగా సంచరించగల అవకాశాన్ని, మీ మనసుకు కల్పించండి ★

# Strategies for Smiles

Most of us spend about three days of every 10 trying to shake off bad moods.

* Distraction, the 1 method, is easy· watching television or reading a magazine It just doesn't have much of an effect on mood

* Trying to solve the problem head-on *does* make you feel better-and, better yet, may fix whatever problem there is that's been giving you grief.

* Remembering your past successes is the best way to feel better about yourself-your mood and outlook soar. Unfortunately, people try to psych themselves up in this manner only about two percent of the time

* Comparing yourself favourably to others or deciding you're better off than before is a great way to boost your self-esteem and your smile.

* Drinking alcohol is one way to drown your sorrows, but once the buzz is gone, so is your good mood. Plus, some people feel worse when they drink-and often afterwards as well.

* Socializing may help for a while, but the smile doesn't stick once you're back home

* Licking your wounds in private, blaming others, and fatalism are popular-but are also ineffective ways to deal with bad moods.

# జీవితం - అర్థం - విలువ

- శివలింగం

జీవితం అనేది ఒక గొప్ప వరం అనికొందరనుకుంటే శాపంగాను, ఒక శిలువగాను భావించేవారు కొందరు జీవితానికి అసలు అర్థంగాని, పరమార్థంగాని ఉన్నదా? - లేదా? అనిపిస్తుంది అన్ని జీవితాలు అర్థవంతంగా వుండవు అంటేకొన్ని అర్థవంతంగా వుంటాయి కొన్ని జీవితాలు అర్థ సంక్లిష్టంగా వుంటాయి

జీవితమనే పదార్థానికి అర్థం విషయంలో భాషాపరంగాను, ఉద్దేశ్యపరంగాను అవినాభావ సంబంధం వుంది. భాషలేకపోతే జీవిత అర్థం తెలిసేది కాదు ఒకపదం దాని అర్థాన్ని తెలుసుకుని మాట్లాడతాం అలాగే ఒక వ్యక్తిని అర్థం చేసుకుని మాట్లాడతాం ఒక ఉద్దేశ్యంగాని, ప్రయోజనంగాని వుండదు ఏదో ఒక కనబడని వస్తువుకోసం అన్వేషణ అటువంటి సచ్చిదానంద వస్తువు, అపురూప సౌందర్యం దృశ్య ప్రపంచంలో గోచరించదు స్వప్న జగత్తులో కనిపిస్తుంది అంతర్ముఖుడైనప్పుడు మనోముకురంలో భాసిస్తుంది దృశ్య జగత్తుకు భిన్నమైన అంతర్జగత్తులో అన్వేషణ కొనసాగితే సంతృప్తి, ఉదాత్తత, అవిచలమైన విశాల శాంతి లభిస్తాయి

మంచీ - చెడులు వుంటంవలన జీవితం అర్థవంతంగా వుందో లేదో చెప్పగలం రెండూ అర్థవంతాలే జీవితం ఇలా వుండాలి అని గిరిగీసి చెప్పలేం అది మనకంట్రోల్ లో వుండటం లేదు. అన్ని జీవితాలకు ఒకే ఉద్దేశం, ఒకే ప్రయోజనం వుండాలంటే జీవితానికి అర్థం అపార్థానికి దారి. ముక్కుతాడువేసి లాక్కెళుతున్నప్పుడు అర్థం గురించి ఆలోచన అనవసరం ప్రవర్తన, క్రియాశీల కార్యకలాపాలు జవాబుదారి

నిరాశావాది వేదనలు, అయోమయ సమస్యలు, క్లిష్ట సమస్యల్ని విడదీయడం వంటివి అర్థ సంబంధితాలు కావు జీవితానికి అర్థం లేదనే నిరాశావాదానికి పాజిటివ్‌గా గాని నెగెటివ్‌గా గాని విలువలేదు అయోమయం అస్తిత్వవాదంలోనూ కనిపిస్తుంది పాజిటివిజం లాజిక్‌లోంచి విట్‌గెన్‌స్టీయిన్‌తో అయోమయవాదానికి దారితీసింది జీవితం అయోమయం అయితే అర్థమూ అంతే అర్థంలేని జీవితాలన్నీ అయోమయంకాదు అయోమయ జీవితాలన్నీ అర్థ రహితాలు కావు అసంబద్ధతలనుంచి సంబద్ధతను సాధించడమే జీవితానికి అర్థం నటనకు వాస్తవికతకు వున్న భేదం సుస్పష్టం అయోమయం జీవితార్థ సమస్య పరిష్కారానికి ఏవిధంగానూ ఉపకరించదు జీవితానికి విశేషార్థం లేదంటే స్వీకరించిన వన్నీ అర్థవంతంగానే పరిగణించాలనే యథార్థం బోధపడుతుంది జీవితమే ఏర్పరుస్తుంది అర్థం అంటుంది అస్తిత్వవాదం అర్థమే లేదంటుంది అయోమయవాదం అస్తిత్వవాద ప్రధాన సూత్రం అహేతుకత కార్యకారణ భావశూన్యత, జీవిత అసంబద్ధత రెండూ వీరిని ఆకర్షిస్తాయి శూన్యవాది (నిహిలిస్టు), అసంబద్ధవాది (అబ్సర్డిస్టు) ఆలోచనలకు, ఆవేదనలకు అస్తిత్వం జీవితమే

సుఖసంతోషాలు, సంతృప్తి, ఆనందం వంటివి జీవితాన్ని అర్థవంతం చేసేవి ఉపయోగవాదికి, కర్మవాదికి ఈ పదాలు రుచించవు. ఈ పదాలు వైయక్తికం కావచ్చు పరిస్థితులవల్ల అర్థరహితంగా కనిపించే జీవితం పరిస్థితులు మారాక తత్వానికి, అర్థంలేని జీవితానికి అర్థానివ్వగల శక్తి ఆ పదాలకు వస్తుంది తాత్త్విక పదజాలం, వినోదాలకు ఆచరణాత్మక విలువ లేదనుకోరాదు.

There are no meanings in a materialist world అన్నాడు సాలమన్ జీవితం యాంత్రికంగా మారిపోయింది జీవితానికి, బాహ్య ప్రపంచానికి అవినాభావ సంబంధం వుంది భౌతిక ప్రపంచం మారడంవలన జీవిత విలువలు కూడా మారుతుంటాయి మౌలిక విలువలు మారవు. జీవితార్థం మారదు. బాహ్యంగా లేక భౌతికంగా జీవితానికి అర్థం లేదు వైయక్తికంగా అర్థం వుంది అంటే జీవితార్థం మానవునిలోనే వుంది పునర్జన్మ వుందనడంవల్ల జీవితం అర్థరహితవాదానికి ప్రధాన కారణమనీ అన్నారు

'రోగంతో మరణం ఈరోజు కాదు రేపు ఇన్నాళ్లూ చేసిందీ ఇంతగా ప్రేమించిందీ అన్నీ పోతాయి కుళ్ళిపోతాయి అన్నీ మరచిపోతారు నేను ఎక్కడా వుండకుండా పోతాను ' ఈవిధంగా టాల్‌స్టాయ్, కామూ, హెడెగ్గర్, సార్త్రేలు వాపోయారు మరణం అనివార్యం జీవితం క్షణికం ఈ క్షణికాన్ని శాశ్వతం చేసుకోవాలని మానవుడి తపన. శాశ్వతం చేసుకోవాలని అభిలాష భౌతికంలో వస్తువుకు నాశనం వుందిగనుక శాశ్వతానికి విలువలేదు. అర్థం శాశ్వతాన్ని కోరితే, జీవితం కోరినదాన్ని యివ్వలేదని మరణం చెపుతున్నది దీన్నిబట్టి జీవితార్థం మీద మరణం negligible impact వుందని తెలుస్తుంది జీవితాన్ని మరణంవలన పోగొట్టుకొనడం వలన జీవితానికి విలువ వచ్చింది వస్తువు విలువ పోగొట్టుకున్నప్పుడు తెలుస్తుంది. ఏది పోగొట్టుకుంటున్నామో అది విలువైనది.

ఏకరీతి జీవితం విసుగుపుట్టిస్తుంది. ప్రకృతిలో వున్న ఏకరీతి మనిషిరోనూ వుంది. విసుగుపుట్టించవచ్చు కాని విలువ లేనివికావు. విలువకు మూలం జీవితం.

అమరత్వం జీవితాన్ని అర్థరహితం చేస్తుందంటారు

If we were immortal we would legitimately postpone every action for ever.

మర్త్యత్వం విలువను నిర్మిస్తుంది అమరత్వం స్థితిశీలం మర్త్యత్వం గతిశీలం క్రియాశీలం

మహోన్నత నాగరికతలు వికసించి రాలిపోతున్నాయి ఎన్నో కట్టడాలు, దేవాలయాలు నిర్మించారు. శిథిలమైపోయాయి. పుట్టింది నశించక తప్పదు నిర్మించేవాడు నశిస్తుందని చేయడు May go on for ever అనుకుంటాడు. భవిష్యద్దశ ఎలావున్నా నిర్మాణం గొప్పది విలువైనది. నిరాశపడితే నిర్మాణం జరగదు.

జీవించడంకోసం జీవితం. జీవిస్తూ వుండటమే దాని స్వభావం. జీవద్వస్తువు యొక్క జీవితం life itself తప్ప వేరే లేదు

జీవితంమీద అసంతృప్తి, నిర్లక్ష్యం వున్నప్పుడు బుద్ధి శుద్ధిద్వారా సంతృప్తిగా, లక్ష్యంగా వుండేట్టు మార్చుకోవచ్చు.

జీవిత సమస్య వైయక్తికమేగాని సామాజికంకాదు వైయక్తికాన్వేషణ ద్వారా తెలుసుకోవలసిందే. పారిశ్రామిక నాగరికత ఆదిమ ప్రజల జీవితాన్ని మార్చివేసింది. బయట వారివల్ల జరిగిన మార్పు వైయక్తికం కాదు. సామాజిక ఆర్థిక నిర్మాణాల ప్రభావ ఫలితం వ్యక్తి భావాలే జీవితాన్ని నిర్మిస్తాయి. ఆ జీవితమే అర్థాన్ని ఏర్పరుస్తుంది.

గాంధీ జీవితం భారతదేశ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనడంవలన అర్థవంతమయింది నా జీవితమే నా సందేశం అనగల శక్తి గాంధీకి వుంది.

మహాత్ముల జీవితాలు అర్థవంతాలే. సోక్రటీసు, బుద్ధుడు, మార్క్స్, గాంధీ, డార్విన్, కాంట్‌ల జీవితాలు విశాల ప్రశాంతంతో గడచాయి.

ధార్మికతయే జీవితానికర్థం అనీ, నైతికతయే అర్థం అనీ అంటారు. సాంప్రదాయక మత జీవనంలో ఆస్తికత ప్రధాన విశ్వాసంగా వుండటం వలన జీవిత పరమార్థం స్పష్టంగా, ఖచ్చితంగా వివరించారు ఆధునికుల్లో జీవితం పట్ల నిరాశ వుంది పురోగతి ఒక మహా పరిపూర్ణత వైపుకే అనేది కూడా గాలిలో మేడ ప్రగతి-పరిపూర్ణత రెండూ నైయక్తికంగాను సామాజికంగాను విఫలమేగాని సాధించింది స్వల్పం

మన కవులు పునర్జన్మ, స్వర్గనరక మోక్షాలు, వంటి జీవితపు విలువల్ని వారి రచనల్లో పొందుపరిచారు

కాళిదాసు 'శరీరధారులకు మరణమే ప్రకృతి, జీవితం తద్వికృతి మాత్రమే అనిరి బుధులు అందుచే క్షణ కాలమైనా ఎవరైనా ప్రాణి జీవించివుంటే అదే లాభం అనుకోవాలి' అంటాడు రఘువంశంలో.

షేక్‌స్పియరు అనుభవం చూడండి :

Life but a walking shadow, a poor player, ...it is a tale told by an idiot, full of sound and fury, signifying nothing

శ్రీశ్రీ అనుభూతి :

తథ్యం ప్రాణికి మృత్యువు తప్పదు జీవికి వేదన
మనుజునిలో మరణభీతి మదిలో దుఃఖానుభూతి
ఆలోచనలన్నింటికీ అంతర్యంలో పునాది.

మరణభీతి సామాన్యులది దుఃఖానుభూతి తాత్త్వికులది. అందుకే ఈ దుఃఖనివారణ కోసమే బుద్ధుని ప్రబోధాలు.

జీవసాంకేతిక శాస్త్రం అభివృద్ధి చెందుతున్న కొద్దీ జీవిత విలువల నశింపు తప్పదు. 21వ శతాబ్దంలో సహజ జీవజాలం వుండదు అంతా కృత్రిమ మానవ జంతు, వృక్షాలు. జన్యు సంబంధ ఆయుధాల తయారీలో వైరస్, బాక్టీరియాల నూతన సృష్టి ప్రభావంగా పెనుమార్పులు సంభవిస్తాయి. మిణుగురు పురుగులోని జన్యువును తీసి పొగాకు మొక్కలోకి ఎక్కిస్తే ఆకు 24 గంటలు మెరుస్తున్నదట. మనిషిలోని జన్యు కణాలను ఎలుకల్లో ప్రవేశపెడితే రెండింతలు పెద్దవిగా పెరిగాయట. జీవ సాంకేతిక విప్లవంవల్ల తీవ్రహాని జరుగుతుంది. ఆరోగ్యం పూర్తిగా మారిపోయి వింత రోగాలు రావచ్చు. శాస్త్రాభివృద్ధి నిర్మాణాత్మకంగా వుండాలిగాని, నిర్మూలనాత్మకం కారాదు. విలువల్ని సంరక్షించుకున్నప్పుడే జీవితానికి అర్థం, పరమార్థం. ★

**Out of Work and Out of Luck**

"Decades of mechanization, rationalization and computerization have madejobs disappear forever" *Rudolf Markert Vohburg, Germany*

**At:** People probably will move out of cities-but not necessarily for safely reasons They'll move because we've shifted toward an information-based economy where millions of people can work where they wish to work. Still, those 10 places that could shut India down are not necessarily cities like Bombay

# గాంధిజీ తాత్విక నేపథ్యం

- ఆచార్య పి.ఎస్. శాస్త్రి
M.A. (Mdltt) Ph.D., D.Litt.

మహాత్మాగాంధి అవలంబించిన హింసారహిత పోరాటమార్గాలే సత్యాగ్రహం, శాసనోల్లంఘనం, సహాయనిరాకరణ స్వాతంత్ర్య సమరంలో ప్రధానపాత్ర వహించాయి ఆయన జీవితంలో దక్షిణాఫ్రికాలో గడపిన కాలం, అక్కడ సంపాదించిన అనుభవాలు అమూల్యమైనవి దక్షిణాఫ్రికాలో జరిపిన స్వేచ్ఛా పోరాటంతో జైలు శిక్ష అనుభవించినప్పుడల్లా ఆయన అనేక గ్రంథాలు, ప్రముఖుల రచనలు పఠించి వాటినుంచి తన మదిలో మెలిగే ఉద్యమరూపాలకు స్ఫూర్తి పొందేవారు అలాగే ప్రయాణాలు చేసే సమయంలోకూడా అనేక గ్రంథాలు చదివేవారు

దక్షిణాఫ్రికాలోని భారతీయులకు సమకాలీన పరిస్థితులపై అవగాహన కలగజేయటానికి, వారికి ఉత్తేజపరచటానికి 1904లో 'ఇండియన్ ఒపీనియన్' అనే పత్రిక ప్రారంభించాడు. ఆ పత్రిక ద్వారానే స్వచ్ఛంద త్యాగపూరితమైన 'సత్యాగ్రహం' అనే భావనకు అధిక ప్రచారము, ఆమోదనము పొందగలిగాడు ఆయన. ఆ పత్రికా వ్యవహారాలు చూడటానికి ఒకసారి జోహానెన్‌బర్గ్‌నుంచి నేటాల్ వెడుతూ, తన స్నేహితుడు ఐరిష్ జాతీయుడు పోలక్ ఇవ్వగా ఆరైలు ప్రయాణంలో రస్కిన్ రచించిన 'అన్ టు ది లాస్ట్' అనే గ్రంథాన్ని ఆమూలాగ్రంగా చదివి ఎంతో ప్రభావితుడనయ్యానని ఆయన స్వీయచరిత్రలో రాశాడు అలాగే గాంధిజీ టాల్‌స్టాయితో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపి అనేక విషయాలపై చర్చించేవాడు ఈ రచయితల సాంగత్యంతో అప్పటికే గాంధిజీలో మొలకెత్తి చిగురిస్తున్న భావాలకు మరింత బలాన్ని చేకూర్చాయి.

తన స్నేహితుడు పోలక్ దక్షిణాఫ్రికానుంచి వెళ్ళిపోయేముందు ఒకనాడు 'డేవిడ్ హెన్రీతోరో' రచించిన 'సివిల్ డిసొబిడియన్స్' (Civil Disobedience) అనే వ్యాసాన్ని గాంధిజీకిచ్చి ఒకసారి చదివి తిరిగి తనకిమ్మన్నాడు. మర్నాడే పోలక్ ప్రయాణం కావడంతో, ఆరోజే దానిని చదివాడు గాంధిజీ ఆ వ్యాసంతో అత్యంత ప్రభావితుడైన గాంధిజీ ఆ రాత్రంతా కూర్చొని దాని నకలు రాసుకొన్నాడు దక్షిణాఫ్రికాలో రెండోసారి జైలుశిక్ష అనుభవిస్తూ 'తోరో' వ్యాసాన్ని ప్రతిరాత్రీ చదువుతూ, ఉత్తేజితుడవుతూ, చివరకు దాన్ని కంఠస్థం చేసేసుకున్నాడు.

సిద్ధాంతాలకు లోబడి కార్యచరణ చేపట్టాలని 'తోరో' తన వ్యాసంలో వాదించాడు అన్యాయమైన చట్టాలు మనిషిపై రుద్దినప్పుడు ఏం చెయ్యాలి? వాటికి అతను తలవొగ్గక తప్పేదికాదు. ''ప్రభుత్వాలు ఎప్పుడూ ఒక క్రీస్తుని శిలువేస్తాయి, కొపర్నికస్, లూథర్‌వంటి మేధావులను దేశం నుండి బహిష్కరిస్తాయి వాషింగ్‌టన్, ఫ్రాంక్లిన్ వంటి వారిని విప్లవకారులుగ ముద్ర వేస్తాయి. ప్రభుత్వాల నియంతృత్వ ధోరణులు లేక అసమర్థతలు పెచ్చుపెరిగి సహించలేక పోయినపుడు వాటిని తిరస్కరించి ప్రతిఘటించే హక్కు మనకుంటుంది'' ఇటువంటి దృఢమైన భావాలను వ్యక్తం చేసిన తోరో, ఎమర్సన్ కూడా అప్పటికే భగవద్గీత

విష్ణుపురాణం, మనుస్మృతి, హరివంశం మున్నగు హైందవగ్రంథాలు అధ్యయనం చేసి వున్నారు తోరో వ్యాసం వైయక్తిక విలువకు అర్థం పట్టింది.

తనపై 'తోరో' ప్రభావం ఎంతగా వుందో తెలుపుతూ 1942లో ఒక సందర్భంలో అమెరికా స్నేహితుల నుద్దేశించి రాస్తూ గాంధిజీ ''నేను దక్షిణాఫ్రికాలో చేపట్టిన ఉద్యమాలకు శాస్త్రీయమైన ప్రమాణాలను చూపగలిగిన 'శాసనోల్లంఘన కర్తవ్యం' 'Duty of Civil Disobedience' వ్యాసం రాసిన 'తోరో' నాకు గురుతుల్యుడు'' అని పేర్కొన్నాడు.

గాంధిజీ ఉద్యమానికి ''శాసనోల్లంఘనము'' అన్న నామకరణం తోరో "Civil Disobedience" వ్యాసంయొక్క స్ఫూర్తియే ఆవ్యాసం తనని బాగా ప్రభావితం చేసిందని, దక్షిణాఫ్రికాలో 'ఇండియన్ ఒపీనియన్' పత్రికా పాఠకులకోసం ఆవ్యాసంలోని కొన్ని భాగాలను ఆ పత్రిక ఆంగ్ల సంచికలోనూ, వాటినే అనువదించి గుజరాతీ సంచికలోనూ ప్రచురించానని ఆయన పేర్కొన్నాడు. ఆ వ్యాసంలోగల నిజాయితీని, సమర్థనీయతనూ మెచ్చుకొంటూ'' తాను ఆచరించి చూపడానికి సిద్ధపడని విషయం ఏదీ చెప్పలేదు'' అన్నాడాయన ''ఆశయం, ఆచరణ ఒక దానితో ఒకటి పెనవేసుకోవాలి తను నమ్మిన సిద్ధాంతాల కోసం వ్యధిత మానవాళికోసం 'తోరో' జైలుకెళ్ళాడు'' అని గాంధిజీ కొనియాడాడు

కాలిఫోర్నియాలో కార్మిక సమ్మె సమయంలో ఒక బహిరంగ సభలో 'తోరో' వ్యాసాన్ని చదివినందుకు ప్రఖ్యాత నవలాకారుడు అప్‌టాన్ సిన్‌క్లెయిర్ అరెస్టు కాబడ్డాడు. జెర్సీ సిటీ పాలకుడు ప్రవేశపెట్టిన 'యంత్ర' పాలనకు వ్యతిరేకంగా జరిగిన ఒక సభలో తోరో వ్యాసం చదివినందుకు నార్మన్ థామస్‌ను ఫ్రాంక్ హేగ్‌ను ప్రభుత్వం అరెస్టుచేసింది 1917లో ప్రవేశపెట్టిన పురుషుల నిర్బంధ సైనికసేవ చట్టాన్ని వ్యతిరేకిస్తూ జరిపిన బహిరంగ ప్రదర్శనలలో తోరోవ్యాసం చదివినందుకు గోల్ట్‌మాన్‌ను అరెస్టు చేశారు. ఈ శతాబ్దపు 50వ దశకంలో సెనటర్ మెకార్థి యునైటెడ్ స్టేట్స్ ఇన్‌ఫర్మేషన్ సర్వీసు ఆధ్వర్యంలో నడపబడే గ్రంధాలయాలన్నింటినుంచీ తోరో వ్యాసాన్ని తొలగింపజేశాడు

1942లో రూజ్‌వెల్టుకు రాసిన ఒక ఉత్తరంలో గాంధీజీ ''తోరో, ఎమర్సన్ రచనలనుండి నేను చాలా లాభం పొందాను'' అని పేర్కొన్నాడు. 1931లో రోజర్ బోల్డ్‌విన్‌తో మాట్లాడుతూ తోరో వ్యాసం తన రాజకీయ సిద్ధాంతాలకు, బ్రిటిష్ వారిపట్ల భారతీయుల ప్రతిఘటన పరంగానే కాక, ప్రభుత్వమూ - ప్రజలమధ్య ఉండే సంబంధాల గురించి తనకుగల వ్యక్తిగత భావాలకు కూడా సారాంశంగా గోచరించిందని అన్నాడు గాంధిజీ ''అమెరికా జాతీయుడు తోరో మదిలో రూపు దిద్దుకొన్న సిద్ధాంతం భారతీయులకు అనువైన తత్వంగా గాంధిజీ గ్రహించినట్లు కనపడుతోంది'' అంటాడు ప్రఖ్యాత రచయిత మిల్లర్

భారతదేశంలో గాంధీజీ చేపట్టిన సత్యాగ్రహ 'Civil Disobedience' ఉద్యమానికి తోరో వ్యాసంనుండే ఎక్కువగా స్ఫూర్తి లభించిందని చెప్పుకోవచ్చు. ఆ ఉద్యమం బ్రిటిష్ రాజ్యాన్ని గడగడ లాడించింది. దరిమిలా గాంధిజీ అనుసరించిన విధానాలు ఆసియా, ఆఫ్రికాలలో స్వతంత్ర ఉద్యమాలపైన, అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ప్రజ్వరిల్లిన పౌరహక్కుల (Civil Rights) ఉద్యమంపైన ఎంతో ప్రభావం చూపాయి

# ఆడం బాంబులు

– ఆదివిష్ణు

నాకు తెలుసు. మగాడి బతుకు ముదనష్టమయ్యే రోజులు దగ్గర పడ్డాయి!

ఎట్లా చెప్పగలవని తమరు నన్నడగచ్చు. మనవి చేస్తాను.

లోగడ - అరిటాకు ముల్లు గురించి శాస్త్రకారులు చెప్పిన సూక్తికి గొప్ప గిరాకీ వుండేది. అరిటాకు మీద ముల్లు పడినా, ముల్లు మీద అరిటాకు రాలినా - నష్టపోయేది అరిటాకే సుమతీ అని వారన్నారు. చెప్పేదేదో సూటిగా చెప్పేస్తే అది సూక్తి కాదని హారికోడవుటు. అంచేత ఆ విధంగా అట్నుంచి నరుక్కొచ్చి ఒక స్టేట్ మెంటిచ్చేరని మనం అర్థం చేసుకోవాలి అరిటాకంటే ఆడమనిషనీ, ముల్లంటే మగమారాజని అన్వయించుకుంటే చాలా ఈజీగా ఆన్సరు దొరుకుతుందిట. వదిలేయండి.

అరిటాకు థియరీలో వున్న అలుసుని ఆసరా చేసుకుని మొన్నమొన్నటి వరకు మగమారాజు పేట్రేగిపోయేడు.

పెళ్లవుతే పెళ్లామొస్తుందనే పాయింటు కంటే భారీ ఎత్తున కట్నం గుంజవచ్చనే అంశానికి మాత్రమే ఓటు వేసేడు.

పెళ్లయింతర్వాత కట్టుకున్న భార్యని అడ్డం పెట్టుకుని స్కూటరు గట్రాల్లాటి అమాంబా పతు అలాంకారాలన్నీ ఎంచక్కా అత్తవారిని అడుక్కుంటో హాయిగా బతికేయడానికి అలవాటు పడ్డాడు.

ఆడపిల్లని కన్న పాపానికి అత్తగారిని ఎప్పటికప్పుడు శిక్షిస్తూ, వారి ఖర్చు మీద ఆనందంగా బతికేస్తూ, వాళ్ల బతుకుల్ని చితగ్గొట్టడం హాబీగా పెట్టుకున్నాడు.

అడిగింది కాదంటే - మీ అమ్మాయి బతుక్కి కిరసనాయిల్తో మంగళహారతి పడతానని అల్టిమేటమిచ్చేడు

దీపాలు వెలిగించేందుకే కాదు - అత్తవారింటి దీపాల్ని ఆర్పేయడానిక్కూడా కిరసనాయిలు బాగా పనిచేస్తుందని కొత్తరకం అడ్వర్టైజ్ మెంటు తయారు చేసేడు

వెలిగించేందుకే కాదు ఆర్పేయడానిక్కూడా పనికొచ్చే దివ్యమైన దినుసు కిరసనాయిలని వ్యాపార రహస్యం తెలిసిపోవడంవల్ల దానిరేటు కూడా పెరిగిపోయింది!

బిజినెస్సు గొడవ వదిలేయండి. పాయింటుకొస్తాను.

అడిగిందిస్తే మీ అమ్మాయి బతికి వుంటుంది - లేకపోతే ఆమె బతుకు కిరసనాయల్తో ఆర్పేస్తానని అత్తవారింటికి నోటీసులు పంపించి - త్రీ ఇన్ వన్లూ, మెళ్లో బంగారు గొలుసులూ సమకూర్చుకునే అల్లుళ్ల ఆగడాలకు ఆ మధ్య ఒకానొక ఆదర్శ యువతి బ్రేకు వేసింది.

పెళ్లి పీటలమీదే ఒక కాగితమ్ముక్కలో నాలుగక్షరాలు గీకేసింది. మంత్రాలు చదివే పంతుళ్లతో పాటు భజంత్రీల వాళ్లచేత కూడా సాక్షి సంతకాలు చేయించింది.

ఆ కాగితమ్ముక్కలో ఆమె రాసిన అక్షరాలు అతి కొద్దిగా వున్నా - అవి ఆటంబాంబులకే మాత్రం తీసిపోని విధంగా అఘోరించేయి!

నేను ఆత్మహత్య చేసుకునే ఆఫ్టరాల్ అబలను కానీ, బేలను కానీ కానే కాదు. అంచేత రానున్న కాలంలో కిరసనాయిల్తో నా కాలం తీరిపోతే - అందుకు మా శ్రీవారు, వారి తాలూకు బలగం యొక్క పనితసంగా భావించి శిక్షించడనే అక్షరాలు ఆటంబాంబులు కాకపోతే అరటి తొక్కలవుతాయా?

అదుగో - అప్పట్నుంచి కిరసనాయిలు ధర అదుపులో వుందని ఆర్థిక శాస్త్రవేత్తలు కూడా అంగీకరిస్తున్నారు

సరిగ్గా అప్పట్నుంచే అరిటాకు ముల్లు థియరీ కూడా తిరగబడిపోయింది!

ఇప్పుడు అరిటాకుని మగాడిగానూ, ముల్లుని ఆడమనిషిగాను సవరించి చెబుతున్నారు శాస్త్రకారులు. అంచేత మగమారాజనబడే అరిటాకు, ముల్లు అనే ఆడపిల్లమీద రెచ్చిపోయినా వైస్ వెర్సా అయినా మగాడికే డేంజరని బోర్డు కట్టేరు!

ఈ కొత్త ఆపదనుంచి పురుషలోకం బయటపడి, తమ బేవార్సు కోరికలు భేషరతుగా తీర్చుకునేందుకు ఏమిటి మార్గమని భారీ ఎత్తున మీటింగులవీ పెట్టుకున్నారు.

తత్ఫలితంగా సాధింపు కార్యక్రమమనే పేరిట మరో కొత్త మగ థియరీ పుట్టుకొచ్చింది. ఈ థియరీ ప్రకారం కిరసనాయిలూ, ఉరిశిక్షలూ వదిలేసి - ఇల్లాలితో ముద్దూ ముచ్చట్లకు చుక్క పెట్టేసేరు.

ఇంటికొచ్చే ముందు రెండు చుక్కలు మింగేస్తున్నారు ఆ పవరు మీద ఇంటో అడుగుపెట్టి అత్తగారివ్వని అంటు మామిడితోట నాచేతి కెన్నడొచ్చు అని పద్యాలు పాడుతున్నారు. అంటు మామిడితోట నా సొంతమైనప్పుడే నిన్ను అంటుకుంటానని వచనంలో ఒట్టేసుకుంటున్నారు.

ఈ ఆగడం యావత్తూ కిరసనాయిలు చావుకంటే భయంకరంగా వుండటంతో ఈ రచనకు రెండోభాగం ఆడవారి పరంగా రాయక తప్పడం లేదు.

* * * * *

ఉదయం పదిన్నర. కన్స్యూమర్స్ ఫోరం ఆఫీసు.

''ఏమ్మా! ఏమిటి నీ సమస్య?''

''మేము కొన్నవి పనిచేయక పోతే ఎవరికి ఫిర్యాదు చేయాలి?''

''కరెక్టు అడ్రస్సుకే వచ్చేవమ్మా! విషయం చెప్పు''

''మా అమ్మా నాన్నా నాకో మిషన్ని కొనిపెట్టేరు!''

''మిషనా? ఏం మిషను?''

''అవసరమైన మిషనే లేండి?''

''అయ్‌సీ! ఎంతక్కొన్నారు?''

''రెండు లక్షలు!''

''అబ్బో! చాలా పెద్ద పద్దే! ఇంతకీ మిషను పేరేమిటో?''

''మిస్టర్ నైన్టీ ఫోర్!''

''పేరు కొత్తగా వుందే!''

''గుణం మాత్రం పరమ పాతదేలెండి!''

''ఏం చేస్తుందా మిషను?''

''ఒక్క ముక్కలో చెప్పాలంటే కొనుక్కున్న మనిషిని జీవితాంతం పోషించడం దాని డ్యూటీ!''

''ఇప్పుడేం చేస్తుంది?''

''మకారు చేస్తోంది. అది కావాలిది కావాలని లంచాలడుగుతోంది. గొంతెమ్మ కోర్కెలు కోరుతోంది!''

''మాటలొచ్చిన మిషనా?''

''మాట తప్పే మిషనని యిప్పుడర్థమవుతోంది!''

''నాకర్థం కావడం లేదు!''

''చెబుతా! నాకు మా వాళ్లు కొనిపెట్టిన మిషను పేరు - భర్త''

''అమ్మో! ఆ గొడవ లిక్కడ చూడరు! అందుకు కోర్టులున్నాయి తల్లీ!''

''ఈ గొడవలు కోర్టులు పరిష్కరించలేవని తెలిసేవచ్చేను తండ్రీ!''

''అయ్యో! కోర్టు వారికి విన్నవించుకుంటే విడాకులు మంజూరు చేస్తారమ్మా!''

''అమ్మో! నాక్కావల్సింది విడాకులు కాదండయ్యా!''

''మరేమిటి?''

''పెళ్లి పేరిట ముదనష్టమైపోయిన మా డబ్బు మాకు వాపసు ఇప్పించాలి!''

''వాపసు ఇప్పించడానికి నువ్వు కొనుక్కున్నది చెప్పులూ చేంతాడు కాదమ్మా! భర్త! మైండిట్!''

''చెప్పులూ చేంతాడూ కొనుక్కుంటున్నట్టే భర్తని కూడా కొనుక్కోవడం ఈ నేలమీద రూలండి. మైండ్ దట్! క్వాలిటీ లేని వస్తువులు కొనుక్కున్నప్పుడు మా డబ్బు మాకు వాపసు యిప్పిస్తున్నమీరు - గుణం లేని భర్తని కొనుక్కున్న సందర్భంలో ఆ ఖర్చు యిప్పించడానికి మీకేం అభ్యంతరం?''

''వామ్మో -''

సశేషం - అని ఈ రచన యిక్కడితో ఆపడం లేదు. విశేషం - అనే ప్రకటనకి నాందీ వాక్యాలుగా యింత రాసేను. చిత్తగించగలరు! ★

# స్వప్న సిద్ధాంతాలు

- అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

రోగుల కలలేగాక, ఆరోగ్యవంతుల స్వప్నాలుగూడా ఇష్టావాప్తినే ప్రతిబింబిస్తాయి. ఒకసారి ఫ్రాయిడ్ స్నేహితుడు తన భార్యకన్న కలను చెప్పి, దానికి అర్థం వివరించ మన్నాడు· ''నా భార్య నిన్న రాత్రి బహిష్టు అయినట్లు కలగన్నానని మీతో చెప్పమంది''. ఫ్రాయిడ్ దీనికి అర్థం ఇలా వివరించాడు: ''మంచి యౌవనంలో ఉన్న భార్య బహిష్టు అయినట్లు కలగంటే ఆమెకు ఋతుస్రావం ఆగిపోయిందన్నమాట. అంటే గర్భధారణ, మాతృత్వము బాదరబందీనుంచి ఆమె ఇంకా కొంతకాలము స్వేచ్ఛను కోరుతున్నది.''

మరొక స్నేహితుడు ఫ్రాయిడ్ వద్దకు వచ్చి ''నా భార్య తన బ్లౌజుమీద స్తన్యం జీరలను చూచినట్లు కలగంది'', అని చెప్పాడు. ఇదీ గర్భధారణనే సూచిస్తుంది. మొదటి కాన్పుకు ఆమెకు పాలు పడలేదు. బిడ్డకు పాలిచ్చుకోలేకపోయింది. ఈసారి, రెండవ బిడ్డకైన సరిపోయి నన్ని పాలు పడాలని ఆమె బలమైన కోర్కె. స్వప్నం ఈ కోర్కెనే సిద్ధింపజేసింది.

ఇలా ఎన్ని కలలను విశ్లేషించినా, అవి అన్నీ గూడ తీరని కోర్కెలను తీరుస్తాయనే న్యాయం ఋజువు అవుతుంది అయితే అన్ని కలలకు విశ్లేషణం అవసరం లేదు. చాల కలలు స్వాపి కోర్కెలను ఏ అచ్ఛాదన లేకుండ, ముసుగులు లేకుండ తీరుస్తాయి. ఇది ముఖ్యంగా మనకు పిల్లల కలల విషయంలో కానవస్తుంది. ఒకసారి ఒకడు తన ఎనిమిది సంవత్సరాల కూతురుతో పాటు, మరి కొంతమంది పిల్లలను వెంటపెట్టుకొని, రోరర్ గుడిసె (Rohrer hut) చూడాలని బయలుదేరి, ప్రొద్దుకుంకడం వల్ల, కార్యక్రమాన్ని మధ్యలోనే రద్దు చేసుకొని, మరొకసారి ఎప్పుడైన తీసుకు వెళతానని పిల్లలకు నచ్చచెప్పి తిరుగుముఖం పట్టాడు... మరు రోజు ఆ పిల్ల తండ్రివద్దకు వెళ్ళి ''నాన్నా, మీరు మాతోపాటు రోరర్ గుడిసెవద్ద... ఉన్నట్లు కలవచ్చింది'' అని చెప్పింది.

ఫ్రాయిడ్ మూడున్నర సంవత్సరాల కూతురు ఒకసారి ఒక సరస్సులో బోటు ప్రయాణం చేసింది. అద్దరి చేరిన తరవాత ఆమె బోటు దిగి రావడానికి ఇష్టపడలేదు. ఆ బోటు ప్రయాణం ఆమెకెంతో సంతోషాన్నిచ్చింది. ఆ ప్రయాణం చాల త్వరత్వరగా అయిపోయినట్లు ఆమెకు అనిపించింది. మరురోజు ఆమె చెప్పిన కల: ''నేను గత రాత్రి సరస్సులో బోటు ప్రయాణం చేస్తున్నాను ''

కలలు, పగటి కలలు - రెండు కూడ మన కోర్కెలనే తీరుస్తాయి. ఈ సంగతి మన సామెతలను చూచినా తెలుస్తుంది ఈ సందర్భంలో, ఫ్రాయిడ్ శిష్యుడు ఫెరెన్క్జీ చెప్పిన హంగరీ సామెతను ఉదహరిద్దాము. జంతువులు ఏమి కలలు కంటాయో తెలియదుకాని, ఆ సామెత ప్రకారం, ''బాతులు ఏమని కలలు కంటాయి? మొక్క జొన్నలను గురించి'' ''పందులు ఓక్ పండ్లను గురించి, కోళ్లు జొన్నల గురించి కలలు కంటాయి.''

పిల్లల స్వప్నాలు సరళంగా ఎందుకుంటాయంటే వారి కోర్కెలు ప్రత్యాదేశితాలు కావు. సంస్కృతి, సమాజాల ప్రభావం పిల్లలపై అంతగా పడదు అందుకని సుఖసూత్రం తన సరళమార్గాన్ని వీడదు. ప్రతికోర్కెను తిన్నగా తీర్చుకోవాలని ప్రయత్నించడం జరుగుతుంది. పిల్లలు పెరిగే కొలది, తప్పొప్పులు తెలిసేకొలది, ఆంక్షలు పెరిగే కొలది, కోర్కెలను బాహాటంగా, తిన్నగా, సరళంగా తీర్చుకోవడానికి వీలుకాదు అందువలన కోర్కెలు అణచివేయబడతాయి. అణచివేయబడిన ఆ కోర్కెలు మారు రూపాలలో స్వప్నాలుగ బహిర్గత మవుతాయి.

స్వప్నాలు తీరని కోర్కెలను తీరుస్తాయని చెప్పడంతోనే ఫ్రాయిడ్ ఆగిపోలేదు. ప్రతి స్వప్నం లైంగిక వాంఛను తీరుస్తుందన్నాడని కొందరి మతము. ''స్వప్నం అచేతనానికి రాచబాట గనుక, అది అచేతన విషయాలను వ్యక్తంచేసే భాష కనుక, ఫ్రాయిడ్ లైంగిక వాంఛనే వ్యక్తం చేస్తుందని చెప్పాడని, వారంటారు. కాని ఇది యథార్థం కాదు. యౌవనంలో ఉన్న విరహిణులకు, సన్యాసులకు వచ్చే కలలు, తిన్నగా, సరళంగా, ఏ ఆచ్ఛాదన లేకుండ లైంగిక స్వభావాన్నే తెలియజేస్తాయి కొన్ని కలలలో లైంగిక స్వభావం వైచిత్రి చెంది, ప్రతీకలలో కనిపిస్తుంది. ఇటువంటి వాటిలో ముసుగు పెద్దగా ఉండదు. ఉదాహరణకు, ఒక యువతి తనను ఎవరో, పిడివైపు జుత్తుఉన్న కత్తితో, పొట్టలో పొడుస్తున్నట్లు కల గంది ఈ కల లైంగిక స్వభావం తేలికగానే తెలుస్తుంది. కాని అన్ని కలలలోను లైంగిక స్వభావం ఇంత తేలికగా బయటికి వ్యక్తం కాదు. ఉదాహరణకు ఫ్రాయిడ్ చెప్పిన కలను చూద్దాము ఇది పైకి లైంగికంగా కనిపించదు కాని ప్రతీకాత్మంగా లైంగిక వాంఛను వ్యక్తం చేస్తుంది.

> ''రెండు రాజప్రాసాదాల మధ్య, కొంచెం లోపలికి చొచ్చుకొని తలుపులు మూసిన ఇల్లు ఉంది. నా భార్య, ఆ చిన్న ఇంటిలోకి పోయే మార్గం వెంట, నన్ను కొంతదూరం తీసుకువెళ్ళింది. అప్పుడు తలుపులు నెట్టింది. అంతట నేను నిశ్శబ్దంగా, తేలికగా, పైకి ఏటవాలుగ తిరిగి ఉన్న ప్రాంగణ అంతర్భాగంలోకి ప్రవేశించాను.''

ఈ కల పృష్ఠరతి (వీపువైపు నుంచి) వాంఛను వ్యక్తంచేస్తుందని ఫ్రాయిడ్ చెప్పాడు. ఈ కలలోని రెండు రాజప్రాసాదాలు రెండు పిరుదులు. ఏటవాలుగ ఉన్న ఇరుకు మార్గం యోనిద్వారం. చిన్నఇల్లు ప్రేగ్‌లోని ఒక చిన్న యింటిని అతనికి జ్ఞప్తికి తెచ్చింది. ప్రేగ్‌నుంచి, అంతకు ముందురోజు ఒక యువతి స్వాపి ఇంటికి వచ్చింది. ఆ యువతి అతనికెంతో నచ్చింది. అటువంటి రతికి ఆమె పూర్తిగ విముఖురాలు కాదనే భావన అతనికి కలుగజేసింది.

పైన వివరించిన కలలలాంటివేకాక ఇడిపస్ (Oedipus) స్వప్నాలు ఉన్నాయి. ఇడిపస్ కల అంటే తల్లిపొందును అనుభవించునట్లు వచ్చే కల. ఈ కలను కన్నా ఇది గుర్తు ఉండదు. ఇటువంటి వాంఛ ఎంతో వైచిత్రి చెందిగాని స్వప్నరూపం ధరించదు. అయితే ఎంత వైచిత్రి చెందినా, అటువంటి కలస్వభావాన్ని గుర్తించవచ్చు కంటికి సంబంధించిన ప్రతీకలతో లేదా అంధత్వం ప్రాప్తించినట్లు వచ్చే కలలు ఇడిపస్ స్వప్నాలే. అంతేకాకుండా సరళమైన (అచ్ఛాదనలు లేని) ఇడిపస్ స్వప్నాలకు ఎలా అర్థం చెప్పాలో మన పూర్వీకులకు బాగా తెలుసు. జూలియస్ సీజర్, తల్లిపొందును అనుభవించినట్లు కన్న కల మనకు లభిస్తుంది. ఈ కల, భూమిని (మాతృభూమిని) ఆక్రమించడానికి మంచి శకునమని జోస్యులు చెప్పారు

మనం కల కంటాము ఆకలలో కొన్ని ప్రదేశాలు చూస్తాము. ఆ ప్రదేశాలు ఎప్పుడో

ఎక్కడో చూచినట్లు అనిపిస్తాయి. కాని వాటిని ఎక్కడ చూచింది చెప్పలేము. అటువంటి ప్రదేశాలన్నీ తల్లిగుహ్యంగాన్ని ప్రతీకాత్మకంగా ప్రతిబింబిస్తున్నాయని అర్థం చేసుకోవాలి. అందుకని ఆ ప్రదేశాలను ఎక్కడో చూచినట్లు ఉంటుందే కాని ఎక్కడ చూచింది గుర్తు ఉండదు.

ఇలా అనేక స్వప్నాలను పరిశీలించిన మీదట అవి లైంగికార్థాన్ని ప్రతిబింబిస్తాయని అనిపించక మానదు. స్వప్నార్థవివరణం చేసుకొంటూపోయే కొలది ''పెద్దవాళ్ల కలల్లో ఎక్కువభాగం లైంగిక విషయాలతో ముడిపడి, కామవాంఛలను అభివ్యక్తం చేస్తాయని ఒప్పు కోక తప్పదు,'' అన్నాడు ఫ్రాయిడ్ . ఇందులో ఫ్రాయిడ్ కలలలో అధికభాగం అంటున్నాడే తప్ప 'ప్రతి కల' అని అనలేదు. అందుకని ఫ్రాయిడ్ ని పూర్తి లైంగిక వాదిగా జమకట్టినవారు ఈ విషయాన్ని గుర్తించాలి. అంతేకాక, ''ప్రతిస్వప్నానికి లైంగికపరంగా అర్థం చెప్పాలనే సిద్ధాంతం నా అభిమతం గాదు,'' అని ఫ్రాయిడ్ వేరొకచోట చెప్పాడు. మరి కలలలో అధికభాగం లైంగికతను ప్రతిబింబించడానికి కారణం లేకపోలేదు మానవునికి ఉన్న సహజా తాలలో అతి ముఖ్యమైంది లైంగికసహజాతం (Sexual instinct) మన సమాజం అంతగా అణచివేసేది దీనినే. బాల్యంలోగూడ దీనిని యథాతథంగా వ్యక్తీకరించడానికి సమాజం ఒప్పుకోదు. దీనిపై ఉన్నన్ని ఆంక్షలు మరిదేనిపైన లేవు. ఇది అనేక ఒత్తిడులకు, మార్పులకు గురవుతుంది. లైంగిక వాంఛను అణచడానికి రెండు కారణాలున్నాయి. ఒకటి మనం సమాజంలో నివసించినంతకాలం సమాజ ధర్మాలను పాటించాలి. ఏ సమాజం బహిరంగ లైంగికతను ఒప్పుకోదు. కాని సుఖసూత్ర (Pleasure principle = జీవి ఎప్పుడు సుఖం కోరుతుంది) తృప్తిని పొందాలంటుంది. వాస్తవికతా సూత్రం (Reality principle = వాస్తవాన్ని ఎరిగి నడుచుకో) దీనికి హద్దులు పెడుతుంది. రెండవది ఇడిపస్ వాంఛలను వ్యక్తంచేస్తే, తండ్రి ద్వేషాన్ని ఎదుర్కోవలసి ఉంటుంది. అందుకని ప్రాక్ చేతనంలోని సెన్సారులు అటువంటి వాంఛలను నిలువరిస్తాయి.

ఈ వాంఛలు అతి బలీయమైనవి. వీటిని నిలువరించడం ప్రాక్ చేతనానికి అన్ని వేళల సాధ్యంకాదు. ఒక్కొక్కప్పుడు 'న్యూరోసిస్' లక్షణమైన వ్యాకులతగా, సంకల్పానికి వ్యతిరే కంగా మనస్సును ముసిరే (వద్దని తోసివేసినా గూడ కొన్ని భావాలు మనస్సును ముట్టడి స్తాయి) భావాలుగ ఈ వాంఛలు అభివ్యక్తమవుతాయి. ఇలా కానప్పుడు, నిద్రావస్థలో సెన్సారులు ఏమరి ఉన్నప్పుడు, స్వప్నరూపంలో దర్శనమిస్తాయి. అందువలన స్వప్నాలు దాంత అచేతన లైంగిక వాంఛల అభివ్యక్తాలు.

కలలు కామ్యార్థాలను సిద్ధింపజేస్తాయన్నాడు ఫ్రాయిడ్ . కాని అన్ని కలలు అంతేనా? మరి కొన్నికలలు మనకు బాధాకరంగా ఉంటాయి కదా! బాధలను ఎవడు కోరుకోడు. తల్లి చనిపోయినట్లు, సోదరుడు రోగిష్టి అయినట్లు, ప్రియురాలిని ఎవరో ఎత్తుకు పోయినట్లు వచ్చే కలలు ఎన్ని లేవు. ఇవన్నీ కోరిన కోర్కెలు తీరడమేనా? అవునంటాడు ఫ్రాయిడ్ . పైకి బాధాకరంగా కనిపించినా, కలలు మాత్రం, విశ్లేషణానంతరం, కోర్కెలు తీరడమేనని ఋజువు అవుతుందంటాడు. ఉదాహరణకు,

ఒకరోజు ఒక యువతి ఫ్రాయిడ్ వద్దకు వచ్చి ఇలా అంది ''మీకు జ్ఞాపకం ఉందనుకొంటాను. ఇప్పుడు మా అక్కకు చార్లెస్ అనే ఒక బిడ్డ మాత్రమే ఉన్నాడు.

నేను ఆమెతో కలిసి ఉండేటప్పుడు ఆమె పెద్దకొడుకు ఒటో చనిపోయాడు ఒటో అంటె నాకెంత ఇష్టమో నిజంగా ఒటో ఆలన పాలన చూచింది నేనే నాకు రెండవవాడైన చార్లెస్ అన్నాగూడ ఇష్టమే కాని ఒటోపై ఉన్నంత మమకారం ఇతనిపై లేదు. నాకు గత రాత్రి ఒక కల వచ్చింది 'చార్లెస్ చనిపోయాడు శవపేటికలో చేతులు కట్టుకొన్న శవం నా ముందు ఉంది. చుట్టూ కొవ్వొత్తులు వెలుగుతున్నాయి ఇదంతా సరిగ్గా ఒటో చనిపోయినప్పుడు ఎలా జరిగిందో అలాగే ఉంది నాకు చాలా బాధ వేసింది.'

ఇప్పుడు చెప్పండి. దీనికి అర్థం ఏమిటి? మా అక్క కొడుకు చనిపోవాలని కోరేటంతటి నీచురాలినా? లేక నేను అధికంగా ప్రేమించిన ఒటో బ్రతికి, చార్లెస్ చనిపోతే బాగుండునని కోరుకుంటున్నానా?''

''ఆమె చెప్పిన రెండవ ఉద్దేశం అసంభవమని నిస్సందేహంగా చెప్పాను. కొంత ఆలోచించి కలకు అర్థం చెప్పాను కొంతకాలం తరవాత నేను చెప్పిన అర్థాన్ని ఆమె ధృవీకరించింది ఆమె గతం నాకు తెలుసు కనుక అర్థం చెప్పగలిగాను. ఆమె చిన్ననాడే అనాథ కావడంతో పెద్దక్క ఇంటిలో పెరిగింది ఆ యింటికి వచ్చిపోయే అతిథులు, స్నేహితులలో ఒకరు ఆమె మనస్సును చూరగొన్నారు కొంతకాలంపాటు అందరు, వారి సంబంధం పెళ్ళికి దారితీస్తుందని గూడా అనుకొన్నారు. అక్క మనస్సులో ఏముందో కాని, పెళ్లి మాత్రం జరగలేదు. ఇలా బెడిసిన తరవాత ఇక ఆ ప్రేమికుడు ఆ యింటి చాయలకు రావడం మానివేశాడు. ఒటో మరణానంతరం కొంతకాలానికి, ఆమె గూడ అక్కను వదలి వేరే ఉంటోంది కాని ఒటోను మరచిపోలేక పోయింది. అక్క స్నేహితుడిమీద ఉన్న ప్రేమ, ఆమెను ఈ బంధాలనుంచి బయటపడనీయ లేదు ఆమె అభిమానం అతనికి విముఖురాలిని కమ్మని ఆదేశించినా, ఆమె, మనస్సును మరోయువకుని పైకి మరల్చుకో లేకపోయింది ఆ ప్రేమికుడ గొప్ప సాహితీవేత్త, ఆచార్యుడు కావడంతో ఎప్పుడూ ఎక్కడో ఒకచోట ఉపన్యాసాలిస్తూ ఉండేవాడు అతడెక్కడ ఉపన్యాసం ఇచ్చినా, ఆమె వెళ్లి శ్రోతల్లో కూర్చొని తీరవలసిందే అతనికి తెలియకుండ అతనిని చూచే ఏ అవకాశం లభించినా, దానిని ఆమె జార విడుచుకోదు. అంతకుముందు రోజు ఆ ఆచార్యుడు ఏదో గానసభకు వెళ్తున్నాడని, తనుగూడ వెళ్తున్నానని, ఆమె నాతో చెప్పింది. అతనిని చూడడానికే ఈ వెళ్ళడం. ఇది జరిగింది స్వప్నానికి ముందురోజు. గానసభ జరిగింది ఆమె కలను నాకు నివేదించిన రోజు ఇప్పుడు నాకు ఆమె కల పూర్తిగ అర్థమైపోయింది ఒటో చనిపోయిన తరవాత, ఆమె గుర్తుపెట్టుకోగల ప్రత్యేక సంఘటన ఏదైనా జరిగిందా? అని ఆమెను ప్రశ్నించాను. ఆమె వెంటనే సమాధానం చెప్పింది : 'చాలాకాలానికి, ఒటో చనిపోయిన రోజు అతడు వచ్చాడు. ఒటో శవపేటిక వద్ద నిలబడ్డ అతనిని మళ్లీ చూడగలిగాను' ఇదంతా నేను ఊహించినట్లే ఉంది కలకు అర్థం చెప్పాను : 'ఇప్పుడు రెండవ పిల్లవాడుగూడ చనిపోవడం జరిగితే, మళ్లీ అదే సన్నివేశం పునరావృత్తమవుతుంది ఆ రోజు నీ అక్క ఇంటికి నీవు వెళతావు. సానుభూతి చూపడానికి ఆ ఆచార్యుడు తప్పక వస్తాడు. పూర్వంలాగ అదే పరిస్థితులలో అతనిని నీవు మరొకసారి చూస్తావు. అతనిని మరొకసారి చూడాలనే నీ కోర్కెనే - ఈ స్వప్నం తీరుస్తున్నది నీ సంచిలో ఇప్పుడు

గానసభకు టిక్కెట్టు ఉన్నదని నాకు తెలుసు కాకపోతే స్వప్నం కాస్త తొందర పడింది ఈ రోజు గానసభలో జరుగనున్న సమాగమాన్ని చాలగంటలు ముందుకు నడిపింది. కలలో అతనిని చూశావు.''

ఏ స్వప్నానికైనా కారణం అణచివేయబడిన శైశవ (ఎక్కువ భాగం లైంగిక) వాంఛ అంటాడు ఫ్రాయిడ్ . ప్రస్తుత జీవితంలో వ్యక్తి ఎదుర్కొంటున్న లేదా కోరుకొంటున్న వాంఛ స్వప్నానికి ప్రారంభం కావచ్చు అంటే కలను రేకెత్తించే కారణం కావచ్చు. అంతమాత్రంచేత ఈ ప్రస్తుతవాంఛ స్వప్నానికి పర్యాప్తవాంఛ (సరిపోయినంత) కారణం కాజాలదు ఇది గౌణకారణం మాత్రమే. స్వప్నానికి అర్థం వివరించేటప్పుడు, ప్రస్తుత కారణాన్ని దాటి మూలబీజమైన శైశవవాంఛను వెదకి పట్టుకోవాలి ఈ శైశవ వాంఛను ''ఫ్రాయిడ్ వాంఛ'' (Freudian wish) అంటారు ''ఈ గుళ్ళు గోపురాలు కూలిపోవాలి; మతం నశించాలి,'' అని ప్రచారం చేసే ఒకనాస్తికుడు నిజంగా గుళ్ళు గోపురాలు కూలిపోయినట్లు , కల కన్నాడనుకోండి ఆ కల అతని ప్రస్తుత ఆలోచనలకు సరిపోయింది కనుక, దాని వివరణం అంతటితో ఆపరాదు.

> ''నేను అనుకొనే దేమంటే, చేతన వాంఛ ఒక అచేతన వాంఛను మేల్కొలప గలిగినప్పుడే అది స్వప్నానికి ప్రారంభం కాగలదు . ఒక స్వప్నంలో ప్రతిబింబించ బడిన వాంఛ శైశవ వాంఛ అయి తీరాలి నా ఉద్దేశంలో జాగ్రదవస్థలోని చేతనవాంఛ లకు స్వప్నాన్ని రూపొందించే విషయంలో రెండవ స్థానాన్ని ఇవ్వవలసిందే,'' అన్నాడు ఫ్రాయిడ్ .

ఫ్రాయిడ్ తను ప్రతిపాదించిన ''ఫ్రాయిడ్ వాంఛా'' సిద్ధాంతాన్ని కొనసకంటూ పాటించినట్లు కనపడదు అతని అత్యంత ప్రఖ్యాత గ్రంథమైన ''స్వప్నార్థ వివరణం'' (Interpretation of dreams) లో ఏ ఒక్క స్వప్నాన్ని గూడా ''శైశవ వాంఛ'' వరకు విశ్లేషించినట్లు కనపడదు పూర్తిగా విశ్లేషించాడన్న 'ఇర్మా ఇంజెక్షన్' విశ్లేషణం గూడ ఒక స్థాయి వరకే పోయి ఆగిపోయింది పూర్తిగ విశ్లేషిస్తే శైశవ వాంఛ బయట పడుతుందంటూ విశ్లేషణను అసంపూర్తిగ ఆపివేస్తాడు అయితే తన శైశవ వాంఛాసిద్ధాంతాన్ని నిరూపించే ఒక యువతి స్వప్నాని మాత్రం ''సాక్షీభూతం స్వప్నం'' (An Evidential Dream) అనే పేరుతో 1913లో ప్రకటించాడు. ఈ స్వప్నంలో బయటపడిన శైశవ వాంఛ తండ్రితో పొందు, పాయువు (Anus) ద్వారా పిల్లల్ని కనడం (పిల్లలు పాయువునుంచి వస్తారని పసితనంలో ప్రతి ఒక్కరూ భావిస్తారు. దీనిని పాయుజనన సిద్ధాంతం (Anal theory of birth) అంటారు).

కనుక మొత్తంమీద ఫ్రాయిడ్ చెప్పేదేమంటే ప్రతి స్వప్నానికి కారణం వాంఛ అని, ఆ వాంఛ శైశవంలో ఎప్పుడో అణగదొక్కబడి ఉంటుందని, ఆ కారణాన అది అచేతన మవుతుందని, ఈ వాంఛలలో ఎక్కువభాగం లైంగికాలని, ఇలాంటి దంతా అచేతన శైశవ లైంగిక వాంఛ, కలకు మూలకారణ మవుతుందని అంటాడు. అయితే ఈ వాంఛ స్వప్నానికి ఏ విధంగా కారణమవుతుంది? అది స్వప్నంలోకి ఎలా ప్రవేశిస్తుంది? దీని మార్గం ఏమిటి? మొదలైన ప్రశ్నలకు మనం సమాధానం చెప్పుకోవాలి. పగలు మనం అనేక పనులు చేస్తుంటాము. అనేకులను కలుస్తాము. ఎన్నో సంఘటనలు ఎదురవుతాయి.

(సశేషం)

## FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of MISIMI

| | |
|---|---|
| 1. Place of Publication | 1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC X Roads, Musheerabad<br>Hyderabad-500 020 A.P. |
| 2. Periodicity of its Publication | Monthly |
| 3. Printer's Name | ALAPATI RAVINDRANATH |
| Whether citizen of India | Yes |
| If foreigners, state the country of origin | |
| Address | 1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC X Roads, Musheerabad<br>Hyderabad-500 020 A.P. |
| 4. Publisher's Name | ALAPATI RAVINDRANATH |
| Whether citizen of India | Yes |
| If foreigner, state the country of origin | |
| Address | 1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC X Roads, Musheerabad<br>Hyderabad-500 020 A.P. |
| 5. Editor's Name | ALAPATI RAVINDRANATH |
| Whether citizen of India | Yes |
| If foreigner state the country of origin | |
| Address | 1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC X Roads, Musheerabad<br>Hyderabad-500 020 A.P. |
| 6. Names and address of invidicuals who own the news-paper and partners of shareholders holding more than one percent of the total capital. | ALAPATI RAVINDRANATH<br>337-A, Road No.10,<br>Jubilee Hills,<br>Hyderabad-34. |

**I, ALAPATHI RAVINDRANATH,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/ **ALAPATI RAVINDRANATH**
Publisher

Date: March 1, 1994.

(Bombay)



THE LOTUS QUEEN

Postal Regd No H/SD/191